



శ్రీహయగ్రీవాయ నమః

శ్రీబ్రహ్మోత్తరఖండాంతర్గత

# భద్రాయుహోపాఖ్యానం.

యక్షగానము.



గ్రంథకర్త

శ్రీమన్మహాదేవ చరణారవిందసేవ పరాయణుండును శైవ
బ్రాహ్మణకులసంజాతుండగు కనుపానిపల్లి నివాసుండును

కృష్ణకవిచే

రచియింపబడియె.

ఇయ్యది.

ప్రమాదాది దోషరహితంబగునట్లుగా పండితులచే
పరిష్కరింపబడెను.

శ్రీపరమేశ్వరార్పణమస్తు.

1946.

వెల 12 అణాలు





# భద్రాయుపాఖ్యానము

## యక్షగానము



— శ్రీపార్వతీశాయనమః —

గణపతిప్రార్థన.

క. శ్రీగణపతి నిను మదిలో । బాగుగనే వేడుచుంటి పార్వతితనయా
భోగీశభూషనందన । వేగమె నన్నేలవయ్య విమలచరిత్రా.

సరస్వతీస్తుతి.

క. సురజ్యేష్ఠురాణి నిను శ్రీ-కరమొప్పగ వేడుకుంటి కావుమి వేగన్
పురహార ప్రియదాసుల ఘన । చరితము నొనరిం తు కరుణచేగనుతల్లీ.

సుమతిదేవి రావటం.



క. శ్రీకేశవ సంస్తుతహార । లోకేశ్వరవంద్య ఫాలలోచన యభవా
శ్రీకనుసానిపలీశ్వర । కాకోదర భూషచాలగా వినుతింతుర్.

దరువు అటతాళం.

శ్రీకారా వైభవా శ్రితభక్తమందారా వాసు దేవా । వా । లోకేశా వినుతా నే నీకు శరణుజేతు వామదేవా ॥౧॥ గరుడవాహన మిత్రి కరుణించు మ్రొక్కెద వామదేవా । వా । పరమపావనమూర్తి శరభస్వరూపాకా వామదేవా ॥౨॥ నగవాసా జగదీశా నాగేంద్రా భూషణ వామదేవా । వా । భగవస్వరూపాకా పార్వతీ నాయకా వామదేవా ॥౩॥ క్షితిలో కణసాణపల్లి శితికంఠ సర్వేశా వామదేవా- నిన్ను నుతియింతు కడువేడుక మదిలోన యెప్పుడు వామదేవా ॥౪॥

సుమతివాక్యము - కందం.

నీలాలాకి విశమింకను । చాలగ మావాత్తలన్ని చయ్యాన నీకుర్
బాలరో తెరవెడలియునే వాలాయము దెల్పెదాను వారిజనేత్రీ.

దరువు - ఆదితాళం

దేవినీ వినావే సుమతి । దేవిని నానామామమ్మ । సౌందర్య ముఖిరో । దేవినినానామమమ్మా । దేవినివిను నే కేవలగుణినే । భావ జుసతి సరిరివిని గలిగిన ॥మిత్రి॥ శ్రీవైభవముపనూ వెలసితి । శివిజెలం గగనూ వెలసితి । పావనుడగు భవదేవుని మన । సేవజేతునికా భూవలయంబున ॥దే॥౧॥ మేలుగా శృంగారమైనా ఫాలమందూనా వినవమ్మ । కస్తూరిబొట్టు ॥ ఫాలమ దునా వినావమ్మ । చాలగ మేనుసుశీలత గల్గి । నీలవేణిరో బాలేందు ముఖిని ॥మిత్రి॥ మేలు భూషణములూ దాల్చితి । చా. జనులు గొలువర్ వెలసితి । బాలామణిరో శీలతయును నేచాలగ దెల్పితి చయ్యగ వినగదె ॥౨॥ కరుణ శ్రీకను సానిపల్లె పురహరూని నిరతామూను । మనమందు నెపుడూ । పురహరూని నిరతామూను । చరణంబులు నేమరువకా నెప్పుడు । సురనుత శంభుని శరణని వేడెద ॥మిత్రి॥ సురలు ప్రహ్లుజల్లా ఘన భూ-సురలు సరేయనగా । [illegible] వెలసిన । ధ- దశార్ణవేశ్వరు ప్రియరాణిని.

## సుమతి ద్విపద

వికసితాబ్జసునేత్రి శుభాంగి వినవె । అకళంకమతినయ్యి ఆనంద వార్త । విచారింతునీకనూ విన్నాణముగను । పన్నగాభరణుని పద ములునమ్మి । రవివంశమున ధర రహిని చెన్నొంది । భువిని దశార్ణవ భూరిదేశమున । అందమైయొప్పు ముకుందపట్టణము । నందు వసింతు పూర్ణేందు భాస్య । వజ్రబాహుడు నా వరుడువిను కొమ్మ । వజ్రి తు ల్యుడు శూరవర్యుడు వినుమా । సుమతి నానామంబు సుస్థిరముగను। కొవరొప్ప సవతు ల కొందరుగలరు । కోటలు తోటలూ గోపురం బులును । మేలైన మిద్దెలూ మేడలూ గలవు । రంగుగా వనమందిరను లందు గలవు । మంగళప్రదముగా మానితంబైన । ధరణీసురలు వేగ దనరారుచుండి । పరమేష్టిసములిక పాటించిచూడ । బలశాలురగు క్షేత్ర క్షత్రముఖులు గలరు । యిల కుబేరునిగేలి సలుపు వైశ్యులూను। సతతము ధాన్యంబు చాలపండించు । గతకల్మషులు శూద్ర ఖండం బులెన్న । ధరణి శ్రీ కనుసాని పురవాసుడైన । నరహరిసఖుని సుస్థిర ముగ గొలుతు॥

## ప్రభావం – ఏకతాళం.

విరుబోణి విన వె నా దుచరితంబు వేడ్కమీరః । సరసీజనేత్రి ను భూసురులూ దీవించుచుండగ । ధర దశార్ణవ నరనాధునకును । ముద్దు పెము కొలిపెటి సరసిజనేత్రిని ॥విరు॥ అమితామైయొప్పు సుందర సుమతీ నా నామమమ్మ । విమలాంగి సూర్యవంశజు రమణీనీ కమల ముఖిని । సవతులు గలరిః సఖియరొ నాకును । ప్రియములులెన్నగ న్దరు వది నెలతలు ॥వి॥౨॥ శాతచనాంబరములూను మించి మహిదాల్చితినమ్మ। అంచాయానరో [illegible] తేజము కొమ్మ । కాంచనాగరు పునుగు జవ్వాజియు । పొంచి ధరించిన పొలతినిగనవో ॥వి॥ ౩॥కుందా కూట్మలివినుము కుందాపురివాసామమ్మ । నందానందానసఖుని ముం దూగ దలతూమమ్మ । యిందుపదన లింపొంద నిరుగడల । యందు చామరంబందుచు వీవగ ॥వి॥౪॥ క్షోణి శ్రీ కనుసానిపురి స్థానీయూ

ప్రధానివాక్యం.

క. వేంచేసెనిటకు క్షితిపతి । అంచితముగ సేనగొల్వ నతివిభవమునన్
పంచాస్త్ర రూపుడోయన । గాంచియు ముదమొ౦ద జనులు ।
కడు రభసమునన్.

వజ్రబాహు మహారాజు రావుటం.



శా. శ్రీకాళీ హృదయేశునిన్ మనములో చింతింతు సద్భక్తితో
లోకేశునిన్ నగవాసునిన్ పురహరున్ లోకాది సంరక్షునిన్
రాకాచంద్ర వతంసునిన్ దుష్టదనుజా రాతిన్ గిరీశున్ మృడున్
ప్రాకటమొప్పగ వేడు కృష్ణకవిన్ పాలింపవే ఈశ్వరా

రాజు - దరువు ఏకతాళం.

వజ్రబాహుండ యిటుకనూ దెంచేను । బల శౌర్యంబు గల్గు కీర్తిన్ వహించేనూ । వజ్ర వైఢూర్య మణుల వరకిరీట బు దాల్చి - వజ్ర సన్నిభుడటంచు । పూజ్యత । బూజ్యత । నిజ్జగ మందున ॥ప॥ ౧॥ మేరూ నగసమ ధైర్యా గంభీరూడూ । యీ ధాత్రి ఆర్యవినుత సంచారూడూ । శూరూడు వైరీ సంహారుడు సత్యపి । చారూడూ రంగయిన । తెరున । భూరిగ । నారోహణుడనై ॥౨॥ సురలూ సుమ వర్షాములు మైజల్లాను । ఖేచరులు భళి యనుచు మది దీపించాను

ధర అప్సరాంగనాలు యి వొందర నాడుచుండ । సురరాజ సమప్రి కాశుడు । హరుడో । నరుడో । పురహరుడో యన ॥సు॥ ౩॥ యీక్షితి యందూన ఘనశిరి మించినా । శ్రీ । అక్షిసాని పౌరిపక్షామందూన । దక్షజా కాంతునిమది పీక్షితోడూత దలచి । అక్షీణ బలుడై రిపులక్ష శిక్షిత । లక్షణ ॥ దక్షుడయి యిటు ॥వజ్రి॥ ౪॥

పృథాసవాక్యం.

ఉ ఓ మహారాజ నీవు మహినొప్పుగ చక్కదనంబు పెంపునన్
సోముడవో వసంతుడవో సుందరమెన్నగ వింతగల్గినా
కాముడవో జయంతువో గాకను యేపురి పార్థివుండవో
కోమలరూప నీవు తెరగొబ్బున వెళ్ళియు మాకు దెల్పుడీ.

రాజువాక్యం సీసం. కృతిపతి వంశావళి

సీ. శ్రీకరంబుగ క్షితిలో చెన్నొంది వెలసిన ఘనమైన కనుసాని గ్రామమందు । శైవబ్రహ్మ కులాబ్ధి సంజాతుడైనట్టి అంతయ్య కను కూల అతివయైన । రామమ్మ గర్భమున స్వామి కృపతోబుట్టు పుత్రు ల యిద్దరుగలరు భూరిగాను । జ్యేష్ఠపుత్రుం డధిక శ్రేష్ఠుడు వీరయ్య ద్వితీయ నారాయణుం డితపుశాలి॥ తే॥ తృతీయ కొమరుండు విరలు సతత హితుడు । నాలుగవ నందనుండు కృష్ణనామధేయు । ఐదవ సుతుడు సాదేవు డతిగుణుండు । అనుదినము పీర్ని హరుడు రక్షించు గాకా.

—♦ రాజు తెరవెళ్ళుట ఆదితాళం ♦—

కమలాప్త వంశజుండరా । ద్వారకా భువిలో అమితా వైభవ ప్రకాశుడా । సుమతి వసుడు భూజన వినుతుండను । విమలాత్ముడనే సమర శూరుడను ॥క॥ ౧॥ హాటకా రత్న కిరీటుడా । నిరుపామా బలుడా మేటిని జన సంరక్షుడా । లాట మరాట కర్నాట దేశముల । సాటిలేరనుచు మాటికి గొల్వగ ॥క॥ ౨॥ ధరణి కనసాని పురీశుని । నిర తంబు మదిలో మరువానిక అంబికేశునీ । చరణంబులు సుస్థిరముగ నెపుడు । మరువకా నమ్మియు మనుజులువేడగ ॥క। ౩॥

ప్రథాని వాక్యం.

గీ. రాజ మహరాజ మీావార్త తేజమొప్పా । భూజనంబులు వినదెల్పు పుణ్యచరితా । భ్రాసితంబుగ వినమాకు భ్రిమయు గలిగె । రాజమార్తాండ రవికోటి రమ్య తేజా.

రాజు ద్విపద.

శ్రీకరంబుగ వినర స్థిరమతివయ్యి । ప్రాకటంబుగ మాదు భవ్య చరితంబు । వసుధ దశార్ణవ వరదేశమందు । పశుపతి కృపచేత వర గచెన్నొందు । విశదంబుగా ముకుంద సుపట్టణంబు । నిర్జరేంద్రుని మించు నిఖిల వైభవము । వజ్రబాహుండను వసుమతీశుండా । లలి తాంగులును విరుమి యిలయందు నాకు । గలరు నరువదికాంత లల రారుచుండా । అగ్రమహిషి సుమతి అతిగుణశాలి । భద్రాంగి విను దుర్మతియు చిన్నభార్య । యిః దేవతలు మహగలరింక వినుమా । బలువైన క్షత్రియుల్ విలసితముగాను । ధనపతిసముల నాదగు వైశ్యు లూను । మనసిజ సరిబోలు జనయూధములు క్షోణి కర్ణసారిపురి స్థానియు నెపుడు । మానక మదిలోః ధ్యాని తు వినరా.

రాజువాక్యం దరువు ఏకతాళం.

హరివంశజుడను పురహరనుతుడను ధరణీశుడ వజ్రబాహుడా। కరశర ధరుడను ఘన । ధరవైరి సంహారుడా । సురపతి విభవుడ పురు విక్రముడను । కరమొప్పగ శ్రీకర వైభవుడను ॥హ॥౧॥ మేరు సుధీరుడ భూరిపరాక్రుడ । చారు మణిహారా భూషణుడా । ధర సురనుతుడను చును । పురజనులు కడువడి వెడాగా । భేరి భాంకృతులు భూరిరవం బున । నిరతము మ్రోయగ ధరణీపాలితుడ ॥హ॥౨॥ హితుడను కల్మ షహతుడను జనసమ్మతి సంపూర్ణుండరా । సతతము సమ్మతి ఉమా పతిని స్మరియింతురా । వ్రతములు హితవుగ సతతము నెప్పుడు । క్షితి కనుసాని పురీశుడానర్చెటి ॥హ॥౩॥

రాజువాక్యం కందము.

కం॥ ధీవర వినుమా నామది। భావజుజనకుని స్మరించి భావింతు

తగర । కేవలముగ సత్సభయును - గావించగ కోర్కెగలిగె కర
మొప్పంగన్.

రాజుకు మంత్రికి వాదం ఆటతాళం.

మం:—రాజాగ్రణి వినుమి సభ ॥ తేజమున జేయుదమ ॥రా॥ భూజ
నులు మెచ్చాగను భ్రాజితము తోడుతను॥రా॥౧॥

రా:—మంతానమునాను స్వావంతవిను రత్నస్థకి । తాంతమగు వీర
మును చెంతనిడు సంతసము ॥మంత॥౨॥

మం:—వుడమిరాశ్వర మీాయానతి కడువేగమె గడిపేదను ॥వు॥ వుడు
రాజనిభాస్య కడువడిగా సభగావింపుడి ॥౩॥

రా: . వంది మాగధా జనబృందాములు గొల్వగను । సుందరీ మణుల
నికా అందాముతో రప్పించుమా ॥వ॥౪॥

మం:—కుందనపు ఛాయగల మందయానల నిటు । డెందంబున సం
తోషము నొందుచుచు విచ్చేసిరి ॥కుంద॥౫॥

రా:—మేలు కనుసానిపలి । ఆలయమునందాగల । శూలి ఘనలీల
లును చాలమది వర్ణింతమ ॥మే॥౬॥

వచనం. అమ్మహీపతి బంధుజన పురోహితా నందభరితా
త్మ్నుండయి యుండు తదనంతరం.

దుర్మతి రావృటం.

క. శ్రీగిరిజా పాణేశ్వర । నాగాజిత వాసలోక నాయక యుభవా
భోగీశభూష జలతును । బాగుగ కనుసానిపల్లి భక్తాళినుతా.

దరువు ఆదితాళం.

నీలకంఠా । గౌరీలోలా పాలాక్ష దేవ ॥నీ॥ శూలి త్రిపురహార
మేలు మార్కండేయ । బాలపోషా మౌని । లోలా త్రిశూలహస్త
॥నీ॥౧॥ అంగజారి । కాలభంగా లింగస్వరూప ।అం॥ పొంగిఅసురహార
రంగప్రియా రార । సంగమేశా । భవభంగా భుజంగభూష ॥నీ॥౨॥
వామదేవా । మహాభూమి కనుసానిపల్లె ॥వా॥ ధామ కృష్ణాహ్వాయు

ప్రేమచె బ్రోచిన । వ్యోమకేశా । ఉమస్వామి నన్నేలుమయ్యా ॥సీ॥

చెలికత్తియ వాక్యం.

కం॥ వారిజలోచనిసుందరి । మారహరుఁ దలచి మదిని మంజుల వాణీ । కూరిమితోవచ్చినదిగా । పేరెయ్యదొ తెలుపవమ్మ ప్రియ మలరంగా॥

దర్వు - ఆటతాళం.

తరుణీరొ బహుచక్కాదనము చేనొప్పు దుర్మతినకొమ్మా । నా కురులు తుమ్మెదలాకు సరిబోలు వినవె వో ముద్దుగుమ్మా ।౧॥ నిక్కాముగను నాదు చక్కాదనము దెలుపా వినుమి కొమ్మా । మేము చక్కా అదొరకన్నా యెక్కువచవిగల్గు కాంతనమ్మ॥౨॥ గజవైరి నోడించ నిజమధ్యమును గల్గు కొమ్మనమ్మా । వేగనుజనుడా వజ్రిబాహుని కూను ప్రియమైన వనితనమ్మా ॥౩॥ నారీమణిరొ దాసీ లారూఢిగను గల్గు చేడెనమ్మా । యీధరణి కనసానిపల్లి ధామూనిమదిలోన దలతు నమ్మా ॥౪॥

దుర్మతి కందార్థము.

· యి తిరొవిను నేదెల్పెద । సంతసమగు వార్తనొకటి । సామజ గమనా । సంతానహీననౌటకు । కాంతామణి గుందుచుంటి ॥దర్వు॥ కడుప్రేమాజెంది మనములో । పరమేశ్వరూని । విడువాక నెపుడు మనములో ।ప॥ పుడమిలొ పడతుల యిడుములు నెవరికి । గడువగతరమే వుదురాడ్ముఖివిను । అడఁగాచిన వెన్నెలా । నాయెనాబ్రతుకు । పుడమిజన్మించాముందిలా ॥నా॥౧॥

చెలికత్తియా వాక్యం.

ఓసుదతీమణివిను నే । దాచక దెల్పెదను మరియు । దైవము సాక్షిగ । భానువముగ రజితనగా । ధీశుని సత్కారుణతోను ॥దర్వు॥

నీసవతీ సుమతియిప్పుడుగా । గర్భంబునొంది । భూసురులు కడుదీవించ గా ।గ॥ దాశార్ణవసుధధీశులందరికి । వోసఖివిను సంతోషముగల్గెను గాసిజెందూట యేలనే । పుత్రుండుగల్గిన । వాసివైభవమూ నొం దునూ ॥పు॥౨"

దుర్మతి - చెలికత్తియ వాదం - రూపకం.

దు॥ చెలియా । యిలయందుసదానికి ॥చె॥ గలుగుట గర్భము సత్యమ
అలివేణి యిలదెల్పుమ । గలుగగా నామదిలో । సంతసమా ।
లేదు వాడు ॥చెలియా ॥౧॥

చె॥ తరుణీ। పరులను యిట్లనగా ।త॥ ధరణిలో ధర్మంబాయిది పరమే
శ్వరుడూ మెచ్చున । పరులను నిందించా । నీమదికీ । యింతి ।
బంతి ॥తరుణీ॥౨॥

దు॥ పుడమీ - రేడూ నిర్దయమ పై ॥పు॥ బొడుముచదానికి ముద్దుల
కొడుకె జన్మించినమది - పడతీ యిపుడునే । నుడిపితి । నేడు ।
చూడు ॥పుడ॥ ౩॥

చె॥ ముదితా - మది ఖేదమునొందకూము - సదయుండగు నీపతి
సమ్మోదముతో సందర్శిపైని - వదలడుగనువిగా మదవతి - నీతి -
ఖ్యాతి ॥మ॥౪॥

దు॥ సుమతి - గర్భము జెడునట్లు ।సు॥ క్రమమొప్పను విషాన్నము
భ్రమరాలక యికమొదమూ - క్రమముతోనిడిదానుమతికి -మేటి-
బోటి ॥సుమ॥౬॥

చె॥ ధరణీ - కనుసానిపలీశ్వరు ।ధ॥ చరణంబులు మరువకమది తర
లాక్షి పోవుదమా - గిరిశాప్రియుని మనమున - పొంచి -
యెంచి ॥ధ॥ ౬॥

దుర్మతివాక్యం.

కం॥ కడతిరో నుడివెదసేవుగా - కడువేగమె కుడుపునకును - కమ్మని వంటల్ - నిమ పెళ్ళైరంబునందున - జడియక్క కడు మోద మంది . చండాసినరో॥

వ॥ అనిన విని చెలికత్తియ సుగంధమాల్యాను లేపన ద్రవ్యం బులు షడ్రసోపేత భోజనంబులు వళ్ళెర బున నిడుకొని పుడమీశు బడతికడకు జని దుర్మతి సుమతికిట్లనియె.

సుమతి దుర్మతి వాదం ఆటతాళం.

దు:—అక్కవినుమి మొక్కెదానే మక్కువాతోనూ ॥అ॥ నిక్కము
గనీవు క్షేమమ నిజము దెల్పుమా ॥అ॥౧॥

సు:—సుందరి విను ముందుగా నామందిరంబునా । సుం। అంతరమిక
క్షేమమె ఆనందమొదవగా ॥సుంద॥౨॥

దు:—మేలుగా ఫలహారముల్ చాలగానీకూ । వాలాయముగ నోసం
గెద దధి పాలు నేతులూ ॥మె ౩॥

సు:—నారిరో చెవులూరు పులుసు కూరలన్నియూ । కోరను నామన
ము లోన బూరెలు మరియూ॥నా। ౪॥

దు:—దండిగా రుచిగలిగినట్టి పిండివంటలూ । చండికేశు కృపతోనే
నీఅండ నిడెదనూ ॥దండి॥౫॥

సు:—మేలు శ్రీకనుసానిపల్లి నీలకంఠుని । బాలరో స్మరియించి సలిల
మూలు గ్రోలెదనూ ॥మే॥౬॥

దుర్మతివాక్యం గీతం.

గీ. పోదు గృహమున కిప్పుడు పొందుగాను । పాదుగా శంభు పదభక్తి పరగగోరి । ముదితలుల్ దాసిజనులంత ముందు గొల్వ । ముదముతోడను వినవె వో ముద్దుగుమ్మా.

వ॥ తదనంతరంబున సుమతికి గర్భవేదన గలిగినన్ యేమని విలపించు చున్నది.

సుమతి కందార్థం.

వో దయితగమన యిప్పుడు । పాదుగ నవమాసములును । పడ తిరో నిండెన్ । మోదమునన్ గర్భంబున । వేదన జన్మించెనాకు । ॥దర్ప॥ యేదారి దెల్పూ । వోపగువా నన్నీధారా నిల్పూ । బాధా

మిక్కిలి గలిగె బ్రతుకాగనే నింకా। యీ ధారయందు నన్నేలు వారె వరికా యె॥

సుమతి వరువు రూపకం.

నారీమణి తాళ గర్భా। భారమూనకూ ॥నా॥ కారణామిట్లుండగా నేతీరుగా సైతు ॥నా॥౧॥ మగువయింకా యింతనొప్పి మిగుల నాయెనూ। జగతిలో బ్రతుకంగ జాల మగువ చూడగా ॥నా॥౨॥ నక్షమునందు జడుపు గలిగె ఃడతివినగదె ॥వ॥ పుడమియందు నిలువ నోటి తడియు మారెనే ॥నా॥౩॥ వొళ్ళు జెదురనాయెను వోకిళ్ళు ఘనముగా। నీళ్ళు ఇంతరించి నివరె నీరజాక్షులూ ॥నా॥౪॥ బాఃరో కను సానిపల్లి ఫాలనేతు్రనీ। చాలభక్తి వేడుకునరె మేలు చేకూరు ॥నా॥

వ॥ యిట్లు కొంత బాధ పరితాత్మురాయె యు డినంతా యీశ్వరానుగ్రహామున సుమతికి బాలుండు జన్మించెనని సత్వవంతుండు క్షోణికాఁతున కిట్లనియె

ప్రధానివాక్యం.

కం. రాజేంద్ర యాలకింపుము - భూజను లతిమోదమొంద పుణ్యచరితా్ర - రాజీవనేత్రి సుమతికి - తేజోఃధి సుతుడు గలిగె ధీవరయింకన్.

దుర్మతి రాజుకు మంత్రికి వాదం. ఆటతాళం.

రా:—మంతనంబున సత్వవంతా వినిమి నేడు యింతలోనూ। నా కాంతయా దుర్మాతి నింతాలో యిటు బిల్వా బాగుగాను॥

మం:—ధరణీశ నీయాజ్ఞ శిరసావహించియూ వెగమూనా। యాకరి చర్మాంబరుని నేచరణాము నమ్మి నేపొయ్యెదాను ॥౨॥

మం:—అమ్మా నీవిభుడు బల్ సమ్మాతితోడా యీసమయమూనా నిన్ను రమ్మానె పదుమి వోయమ్మ ముద్దులగుమ్మా తీవ్రమూన ॥౩॥

దు:—యిమ్మహీపతి నన్నూ రమ్మానుటకు చాలకార్యమేమి। గలిగె సమ్మాతి దెల్పుచన్ రమ్మనె యెందుకు యూర్విలోన ॥౪॥

మం:—యిలనాధుడును దెల్ప అలివేణి వస్తిని యింతేకాని - వోతర
లాక్షి పదుమి సుందరుడు దెల్పు నీతోవార్త వూని ॥౫॥
దు:—భూమి కణసానిపల్లి స్వామిని స్మరియించి ప్రేమతోనూ । యూ
భూమీశుకడకు బల్ నేమాముతోడాను పొయ్యెదానూ॥౬॥

దుర్మతివాక్యం. కందము.

వందనము నామనోహర - వందనమిదె యిందుమూప వారిజనేత్రా
వందనము ఉమాపతి నా - నందముతో గొల్చియిటకు నరుదెంచి
తికణ.

రాజువాక్య.

క. వర్ధిల్లుమి దుర్మతి యిక - వర్ధిల్లుమి వసుధయందు వారిజనేత్రి
వర్ధిల్లవె జయమొందగ - వర్ధిల్లు శుభాంగి నీవు వర్ధిలురాణీ.

రాజుకు దుర్మతికి వాదం. ఆటతాళం.

దు:—వోకాంతా భూమికాంతా ప్రాణేశ్వర స్వాంతమందున యేమి
పంతామునూ బూని యింతాలోనూ - నీకాంతాను బిల్వ
సత్వవంతు నంపితిరేల - కాంతా ॥౧॥
రా:—వోయింతి - మదదంతియానరో సర్వమంత సూచితు - వో
యింతీ - వింతగనూ గౌరికాంతుడునూ - కాంతరో వింత
ఘున సంతోష మొనరించె యింతీ ॥౨॥
దు:—వోశీలా - భూపాలా త్రిశూలియు చాలాగ యొనరించు -
శీలా - మేలు యిక నాతో చాలా వినన్ - కాళిలోలుని
కృపాయె లీలా నుడువుమీ - శీలా ॥౩॥
రా:—వోభామా । గజగామిని సుమతికి ప్రేమానందానుండు ।
భామా - ఈమహిలో గలిగె క్షేమాముననే । తామారా
సాక్షిరో ప్రేమమీరగ రమ్మి - భామా ॥౪॥
దు:—వోమారా - శరీర సువిచారా శృంగారమాయె నీకా-మారా
ధారుణిలో పుత్రికారుణ్యమున్ మారహరుడు మనా కోరిక
దీర్చేను -మా॥౫॥

రా:—వో బాలా - సుశీలా కనుసానిపల్లి కాలాంతకుని నమ్మి -బాలా బాలా విను చిన్నబాలుడునూ- యేలీల నున్నాడో బాలేందు ముఖి జనుమి ॥౬॥

రాజు దుర్మ్నతి సుమతికి వాదం ఆటతాళం.

రా:—మందయానా యిందుదెమ్మి నందనూని ముందుగానుకందూము మేమునిక సుందారి చూడ్కులచే ॥మం॥౧

సు:—భూతపేశా ఖ్యాతిగాసూ నీసుతుని సంప్రీతితోనూ। భూతేశు కృపతో సంప్రీతి చేకొనుమిందు ॥౨॥

రా:—కంబుకంఠీ కుంభిణదూ డింభకూని చూడునేడు। శంభు సత్కరుణాచే నందాను నిదుగొగొను ॥క॥౩॥

దు:—క్షోణినాధా తనయూని గనినంతాలోను విను। మాసీతముగ తల్లి సుమిత్రుడు వికృత మొందె॥౪॥

రా:—కాంతరో నీకాంతిహీనా మింతయూటా కెందుకానీ। సంతస మూాన వో యింతి నుడువుమిక ॥౫॥

సు:—ధారుణీ శ్రీకనుసానిపౌరి వాసు జగదీశు। చరణాములును నమ్మి నెరుగాను యేసంధి ॥౬॥

సుమతి వాక్యం. కందము.

క. పాిణేశవినుమి తెలిపెద। మానిని మః దుర్మతియును మది కుటిలంబుగ - వూని ఫలారం బిడగా। నేనిట్లయితి వేరుకారణ మెరుగక—

రాజువాక్యం. గీతము.

గీ. మంత్రివర యేమిదోచదు మదిలోనాకు। యింతి పడు బాధ వీక్షించి నంతలోన। త్వరగ రప్పింపు మాంత్రి వైద్యవరుల జాగునేయగవలదింక జనుమివేగా

రాజు దుర్మతి మంత్రికి వాదం.

మం:—భానుకులేశ్వర మానితముగ విను। వూనివచించెద మానిని స్థితియును ।భా। నేను జనియు వైద్యాల నడిగితిని। చానకు

గరళము వూని యొసగిరట ॥భా॥౧॥

రా:—ఇవ్వనితకు విషమివ్వదగునె వో । నవ్వులాటి కాల్ద్రివ్వచు
క్రొవ్వియు । దవ్వులజూడక ద్రివ్వెటిపనులకు । నవ్వరు జను
లికా న్యాయమిహి నవని ॥ఇవ్వ॥ ౨॥

దు: —హరుసాక్షిగ నేనెరుగను యాపని । సరసిజాక్షితో మురయుచు
నుండుమి । మరినేగెద నేతిరిగి గృహమునకు । ధరణీశ్వర మీా
రిరువురె యుండుడి ॥హ॥ ౩॥

రా:—పాటలాధరి యిక యేటికి యిట్లుల । నాచరించకు కోమలియిక
చెలియరో । బోటిరో వినుమి నీమాటవిధము జవ । దాటక
మెదిలెక తామస మేటికి॥ ౪॥

దు: —వసుమతీశ విను శిశదంబుగనూ । పసికూనకు తల్లికి వికృతం
బును । పొసగచూడగను అసహ్యతయూ – మసలక కాంతా
రము జేర్చుమి యిక ॥వసు॥ ౫॥

రా: —పడతిరో కనుసానిపల్లి వాసుహరు । తడయక మనమున ధ్యా
నించియునే । వడిగనంపెదను వనితరో సుమతిని । కొడుకును
పెను కారడవికి నిప్పుడు ॥పడ॥ ౬॥

దుర్మతి వాక్యం.

క: ఈరమణీ సుతులతి విస్తారంహో జాతరోగ తాపత్యవిధిన్
వీరలకతమును నిద్రాహారంబులు దూరమయ్యె ననవరతంబున్.

రాజువాక్యం. కందం.

నరకాయువులై యిచ్చటి । కరుదెంచిన వారు వీరి నతిదూరముగా
బరిపెద దేశమువెడలగ । స్థిరతర రోగార్తులను విశీర్ణకృతులన్.

సుమతి రాజు మంత్రికి వాదం.

రా:—మంత్రానముననూ నేడింతలో వినుమూ ॥మం॥ వింతాగుణ
విక్రాంతా సత్వంత మదిలో చింత మి॥ యెకం॥ కాంతా
మణియూ సుమతిని యిప్పుడు కాంతారమునకు జేరగా । మది
విను । యింతినిబంపు మింపారగా । దంతిగమన యూచింతచె

యుండుట । సంతోషము యికాలేదుగా । కనుగొన స్వాంత మునొప్పదు చూడగా ॥౧॥

మం:—తమ యాజ్ఞయునూ నే క్రమమొప్పగాను ॥త॥ వినూ జేతు నికాను । సుమతిక వనములోను । మిత్ర॥ యేకం॥ విమలా త్మక నీవను తీరుగనే భ్రమరాలక నటనుంచియూ । వినుమిక నీమాటయు యేనూహించియు । ఉమకాంతుని సంభ్రమమున నమ్మియు తమవద్దికి నేవచ్చెద-సరగున నీనేమము గావించెదా॥

మం:— సారాసా నేత్రిరో । నారీ నీవరుడూను । ఘోరారణ్య బు జేరా । నిను బంపగక యాధీరా ॥మిత్ర॥ యేకం॥ మారస్వరూ పుడు మంజు సుభాషిరో ధారుణ ఆజ్ఞనొసంగగా । యిటకును జేరితి నిన్ను నేబంపగా । వారణయానరో మారహరుని సొంపా రగ దలచీ వెళ్ళుమా । ముదితరో యరదము పైనీ వెక్కుమా॥

సు:—జనపాలితుండు । యిట్లనటా విభుండూ ॥జ॥ నిండూ । నిర్భయ మెందూ । నాపైని జూపగనేడూ - మిత్ర॥ యేకం॥ బుడుత నితో కారడవికి యెటులనడతును శ్రమచేనింతగా । వోడలును బడలిక గలుగూ నింతగా । పుడమిలో కసానిపురి గౌరీశుడు యిడుముల నొందా జేసెగా ధరపతి సుతువులు విన్నావించగా॥

సుమతి రాజుతో కందార్థం.

ప్రాణేశ వినుమి నేబహు । కానిది కార్యంబదేమి । గావించి తినో । శాసనముకుక బంపగ । బూనుట న్యాయంబె నీకు ॥దర్వు॥ భూమిశాచంద్రా । కరుణించుమి వో గుణసాంద్రా । యీ మహిలో నన్ను యేలువారెవరిక । నేమాము యిటూల భామాపైబూనుట॥౧॥

రాజు కందార్థయేకం.

రా:—నాతిరో నన్నిట్టుల బహు । ఖ్యాతిగ స్తుతిపరచనేల । కఠిణుం డై తా । దాతయు నొసట లిఖయించిన । వ్రాతయు నిట్లుండె నను చు ॥దర్వు॥ వో తరుణి వెళ్ళూ పురమూను । నాతోను బహు ప్రాశ్నొతరము జెప్పానేలనూ । పాతకమును బహుభూ

తలమునని । రీతిజేసితి విఘాత గలిగెను । నాతి యిటుమాట లాడకా । నోర్మయ్యుము త్వరగా । ప్రీతిజూపింపాకిచ్చటా॥

దుర్మ॥రాజుభార్య వాదం - ఆదితాళం

సు:—వోనాథ విను సన్మానితమానన్నీతీరుగ వనమూనకూ బంపా - వినుమూ బూనుటా కింపా । క్షోణినాథ మానినులకూ ప్రాణ నాధుం డూర్విలో । ప్రాణప్రదమని నమ్మియున్నా చానలక యిటూలనుట దగునే । మానిత గుణధీపాకనుమిక । భానువం శదీపా। మిత్రి॥ ముంగుగ చిన్నా నందనుసితో పొమ్మందు వనుచు యిల సుందరధిపనే । మ:దునూ । కలయందునూ - నెరుగెందునూ । బంధుజనుల కః మందిరమున విడి అందునే గగను । డెందములోపల ।.గుందూ । నాయందూ । నేడిం దూ ।వో।౧।

రా,—నారి బహువేషూచు శృంగార । మాటాలు బలుకుచు కోరీ - నావాక్యము నీలోమీారి । దాంకు నెత్తుక జేరు విపినమును - మారు బలుకకా క్రూరిణి వెళ్ళుము ॥నా॥౨॥

సు:—ధరణీశచందాి చరణము ు కేల్మోడిచి మ్రొక్కెద కారుణ్య ధీరా ! కృపా నాపైని నింపారా । మార సుమశరీరనక బల్ కారడవికిక బంపగా । నారీమణులుక జేసిరి యీాతీరు వికృత మొందునటుల సుని । చార కరుణనేడూ ఎ సద్వీరదయను జూడు ॥మిత్రి॥యేకం॥ యింతిపైని తమరింత కఠినమగు వంత ముతగునటె శాంతగుణా । యింతనూ । మదివింతనూ । ఘనచింతనూ । శాంతము విశచియు వంతల నొందగ దంతి గమన దుర్మతి గావించెక । నాథా । యాదాతా । యీా వ్రాత ॥వో॥౩॥

దు:—నేనూ జేసీతియనుచూను । ప్రాణేశుతో యిట్లాను । కానిమా టలు ఒలుకాను । జాణతనంబును మని నీఘనముగ । పూని యిచ్చటా మానవతీవలె ॥నే॥౪॥

సు:—ఫుల్లాబ్జనేత్రి వుల్లమందున కఠినముబూనుట చెల్లునా నీకూ - నీవైనా వల్లభూనాకు । ఫుళ్ళు లేళ్ళు తోడేళ్ళు ఘోరాభల్లుకా మృగావనం । చెల్లెరో ననుబంప వలదని కాళ్ళు మొక్కేద పల్లవపాణిరో । మళ్ళునటుల జేయూమిక భూవల్లభువిన జేయు ॥మిత్రు॥యెకం॥ ఖండితమిక బహుమెందుగ నాపైనుండవలదు విను ఖండేందుముఖ । అండనూ । విను చుండనూ - స్తుతినిండనూ । దండిగాను యిలనుండి వెడలుటకు నిందురోగి నయియుండగ నిటులా । మెండూ । మైనిండూ । కార్పుండూ

దు:—నాతి యిటనుండక ప్రఖ్యాతి । మారూను విను భూపాతి । నీవిట్లుండుటకు నాతి । వోతరుణీమణి భూతలమందున । క్షితి కర్ణసానిపురివతి నమ్మిజను ॥౬॥

రాజుకు సుమతికి వాదం. ఏకతాళం.

సు:—దయజూడు భువనైకపాలా । కరుణాలవాలా । సవినాయముగ నన్ను శీలా । భువిలోనా యువతూల ప్రపిమాలముగ నెల - ధవులుగాక వేరెవ్వరు బ్రోచెదరు నాధా ॥దయ॥

రా: —బోటి యిట్టుల నన్ను మాటికినీ । మాటికినీ వేడుటేటికినీ ॥బో॥ నూటిగాను వనవాటిక గృహమని । బొటనడువుమికా పాటల గంధిరో ॥బో॥

సు:—సుందారారూపా నేరనుమా । నామనవినుమా - మందిరమును వెళ్ళగనుమా - బంధుమిత్ర జనాది బృందంబులను విడచి - అంధునస్తముక్రా ముందూ లాగినగతిని ॥దయ॥

రా:—నీలవేణిరో చాల లాలించకూ - లాలించకూ ఆనుకూలించకూ - బాల కనుసానిపల్లి ఫాలాక్షునీవేడి - జాలియేల వన మూల నడువుమిక ॥నీ॥

సుమతివాక్యం కందము.

క. పోదున భాస్కరవంశజ - పోదున యిలువెడలి నేను పొందగ ధాత్రిక - పోదున నీదయ దప్పి - యాధర బ్రతుకంగ

జాల యీశ్వర కరుణన్.

వ. తదనంతరంబు నిజసారధివెంట నడువగా రాజభామిని ఘోరారణ్య మార్గంబులన్బడి జనుచు బాలుని తన భుజంబుపయి నిడుకొని పరమేశ్వరుని యిట్లని ధ్యానించెను.

సుమతివాక్యం. కందము.

పరమేశ్వర శివ శంకర – కరుణాకర నీలకంఠ గజచర్మధరా
గిరిపుత్రికా మనోహర - పురహార ననుబ్రోవు మఖిలభూత శరణ్యా.

సుమతివాక్యం దరువు. ఆటతాళం.

శితికంఠా వైకుంఠా పతినుత గౌరీపతి నన్ను బ్రోవుమికా –వో దేవా – యా క్షితిపాతియూ చిన్నసతిలోలూడై నన్నీగతిని గావించే నుగా – వోదేవా ॥౧॥ పుడమిని రాజ్యంబు విడచియు నడవూలబడీ నెండాలో నింతగా – వోదేవా – నడువజాలను చిన్నకొడుకు నెత్తుక తనువు బడలీక నొందెనుగా – వోదేవా ॥౨॥ జనని తనయునాకు ఘనవిషమిడీనట్టులను జేసె భూకాంతుడూ – వోదేవా – జనుదూ నెక్కడికీని నను పాలించెటివారు ఘను లెవ్వరీధాత్రిలో – వోదేవా– సురజ్యేష్టుడు యిట్టితెరుగు నొందగ నొసట కరమూచె వ్రాసెనొకొ– వోదేవా – కరుణించి నేలావె కరిచర్మాంధర స్వామి గిరిపుత్రిలోలా నేడూ - వోదేవా ॥౪॥ వశము దప్పగనాయె విషకంటకాదులు – మెసవె నామైనిండనూ వోదేవా – వసుధ కనానిపల్లి బసవేశా నేను నీవశమైతి పోషింపరా వోదేవా ॥౫॥

వ. యిట్లు వాత తప దుర్గమంబగు నిర్మానుష్య ప్రదేశంబున జనుచున్నంత దైవవశంబునా మణిమయ కూడ్యాలంకారంబగు పురం బొకటి గనుపించినంత.

పద్మాకరుడను వైశ్యరాజు రావుటం.

క. శ్రీవిశ్వేశ్వర పురహార – భావజరిపుదమన లోక భక్తశరణ్యా
భూషలసిత ఘనునాప్పురి – కోనెలనివసించుమహానుని కొరినుతింపుచున్

ప్రధానివాక్యం. కందం.

కం. రవికోటితేజ మీరలు - భువిలో యేభవనమందు పొందు గదార్తిన్ - నివసింతురో మీ నామము - సవినయముగ దెలుప రయ్య సరసగుణాఢ్యా.

పద్మాకరునివాక్యం దరువు ఆటతాళం.

ధాత్రిలోవినుమి త్రినేత్రుని మదిలో సంస్థాత్రి పవిత్రా నుగాత్ముండరా ॥దా॥ యీ త్రిజగంబున శత్రువులు లేకుండ మైత్రిచే వైశ్యపురి పాలింతురా ॥దా॥౧॥ పద్మాకరుండాను భద్రయశుండ ఘనరౌద్రుడ రణరిపు భేద్యుడరా - రుద్రప్రతాపుండ కద్రూవసుత హారు రుద్రుని పాదాసాన్నిధ్యుండరా ॥ధా॥ ౨॥ ఆర్తజన రక్షుండ కీర్తిప్రకాశుండ అర్ధంబునందు సంపూర్ణుండరా - వర్తానజూడ హారు కీర్తానమందు సంపూర్తిగావించు లోకభర్తానురా ॥ ౩॥ యీక్షితియం దూ విలక్షణమును గలుగు ఆక్షిసానిపొరి పాలాక్షునిరా - రక్షించు యాని యాపేక్షితు మదిలో విరుపాక్షు నెప్పుడు వే. దక్షుండరా॥

మాటలు మంత్రితోను.

పద్మ:—సచివాగ్రిమా యుచితంబుగ వినుమి విశదంబౌ వస్త్రపుష్ప రాగాదిచే నలంకరింబడిన సింహాసనము వేయిం మఖిలానేకొలువు కూట బైయుండెదధీరా ఆత్మవిచారా.

మం:—తమ యాజ్ఞప్రకారంబు నేనట్టే నుచితాసనంబిడితి తాము నలంకరింపుడి భూపావైశ్యవంశదీపా.

పద్మాకరుని వాక్యం. కందము.

కం. మంత్రీశ్వర మనపురిలో - సంతసముగ సర్వజనులు నార సమొప్పన్ - అంతయు క్షేమమ తెల్పుమి - స్వాంతములో వినగ కోర్కె సంధిల్లెనురా.

ద్వారపాలకుని వాక్యం.

కం. జనపాల వినుమి నేడును-మన పట్టణమందు జనులు మరి క్షేమంబౌ - విను మొక్క-లేమ ముద్దుల - తనయుని తానెత్తుకోని -

తావచ్చెనికర్.

పద్మాకరునికి సుమతికి వాదం ఆదితాళం.

పద్మా:—వోవనితామణి భూవలయంబున । తావుయేదో తెల్పూ
వావానాగాత్రిరో ॥౧॥

సు:—వినయాత్మక నే ఘనదాశార్ణవ । మనుజేశ్వరు నాకూ । విను
మగ్రిరాణికే ॥౨॥

పద్మా:—వసుధీశున కలావరవణిలనిరై । పసిబాలునితోనూ । పోయె
దవెందూనూ ॥౩॥

సు:—గర్భము గలిగిన కఠినులు సవతులు । గరళమిడిరి నాకుక్ । కని
కరము లేకక్ ॥౪॥

పద్మా:—తల్లిరో నీమే నెల్ల నిటుల బహు ! సల్లబడూటేలా । వినదె
ల్పూచాలా ॥౫॥

సు:—పొసగ విషాన్నము మెసగుటచేతను । మసివర్ణంబూనూ । నైతి
నిక నేనూ ॥౬॥

పద్మా:—భవనము విడిచియు భువిలో నిట్టుల । యువతిరో నెళ్ళాను
కారణము దెల్పూ ॥౭॥

సు:— క్షితి కర్ సానిపురిపతి సాక్షిగను । కుతకేశ్వరూడూ । వెళ్ళి చె
నేడూ ॥౮॥

సుమతివాక్యం.

ఉ. భూతలభర్త చిన్నసతి•బోధకులొంగి వివేకశూన్యుడై
ప్రీతియొకింత లేక మది•భీకర కాననవీధి కంపె నన్
భూతవనాదివాస ఘన•భూరిమృగంబుల బారిదప్పి నే
పాతకి యిచ్చా చావకను•బాలకు నెత్తుక వచ్చితిన్ కృపా.

పద్మాకరుని వాక్యం.

కం. వో పణతి ఖేదమొందకు । భూపతిదయ బొందువరకు పొలుపొందగ నిన్ - కాపాడెద నిచ టుండుమి । శ్రీపార్వతిలోలు దలచి శీఘ్రం బిచటన్.

వ. యిట్లు రాజభామిని వల్లెయని వైశ్యమందిరంబున నుండు నంత భద్రాయువురావుటం.

భద్రాయువు రావుటం.



కం. శ్రీసాంబ సదాశివ హర। యోసారసగర్భ వినుత యో కరకంఠా – బాసుర కర్ణసార పట్టణ। వాసా జగదీశ నీకు వందన మంటిన్-

దరువు యేకతాళం.

రుద్రభక్తుడను అద్రిసుధీరుడా భద్రాయువుండనురా।క్షుద్ర వైరిజన రౌద్రుడం చేటి భద్రాయేశుడనురా। కద్రూవాసుతు కంక ణు నెప్పుడు। భద్రంబుగనే బహుదలంచెటి ॥రు॥౧॥ నీరజాప్త కులధీ రుడ మణిమయహారా శృంగారుడా। మారకోటిసమ భూరికాంతిగల శూరాప్రతాపుడా। వారిజాక్షి సొంపారు సుమతిక్రీ। చారుసుతుం డను వారిజనేత్రుడ ॥రు॥౨॥ ఆటలందు బహుదీటు వహించిన మేటినేని వినుమీరా। బాటలతో చెండ్లాటలాడుచును మాటిమాటికీరా తోటి బాలులను నూటిగ శిలగోటీలనాటలను గీటకగించెటి॥రు॥ ౩॥ క్షోణి కర్ణ సానిపురి స్థానీయుడగు శంభూని వినుతింతురా। మానీని మజ్జనీ సద

నమునకూ పూనీకతోడరా । మానితముగ నేపూనినేగియును । నేను ఎంచనంబూ నొనర్చెదర్ ॥సు॥౪॥

తల్లి కొమారులకు వాదం.

భ:—వందనమూ జనని । మంద సుగామిని ॥వం॥ పొందుగ నీదు పద బృందములాకు ఘన ॥వం॥౧॥

సు:—నందన వర్ధిల్లర । ముందుగ నీధరా ॥నం॥ మందిరమూ విడచి యెందుబోయితివిరా ॥౨॥

భ:—తోటిబాలూలీ కను।ఆటలునాడనూ । బాటలనడుమ చెండ్లాటకు పోయితిని ॥తో॥౩॥

సు:—చిన్నతనయా విను వన్నుగ నీవును ॥చి॥ యెన్నడు లేనిదిటు చిన్నబోవు టేలనూ ॥౪॥

భ:—తల్లిరో మేనెల్లను । చల్లగనాయెను ।త॥ వుల్లము నిల్వాదిక వల్ల వపాణి విను ॥త॥౫॥

సు:—భూమి కనుసానిపురి । స్వామినికా గిరి । ధాముని కీయెరు యే మిటికై యిట్టుల ॥భూ॥

భద్రాద్రియువు వాక్యం.

కం. వోతల్లి బ్రతుకలేనిక । నాతల బహుదిరుగుచుండె నాతిరొవినుమా । ఘూతకు నోర్వగ జాలను । యీతరిశ్రమ యెన్నడైన యెరుగను తల్లీ.

వ. యిట్లు మూర్ఛనొంది భూమిపైబడి గతజీవుండయినంత సుమతి దుఃఖించుటా.

సుమతి కందార్థం.

హారాజసన్నిభానన । హారాజ కొమారధీర । హానుకుమారా । హారవివంశ సుదీపా । హారమణీయాంగ యెటుల దర్పు॥ హతమయ్యె తీవా వోసుత నాకే గతిముందూ తోవ్రా । కుతలంబునా నీకుమితి వాసెనాబ్రహ్మా । క్షితియందునా నాదు బ్రతుకునవ్యర్థము చేసి ॥హా॥

## సుమతి దరువు జంపెతాళం.

అయ్యయ్యో నాముద్దుతనయా। నీవు హతమైతివా ఘనా వినయా। యిప్పోడా నీయందు యీశ్వరుం డలిగెనా। వెయ్యారు విధములా వెతల నొందగనాయె ॥అ॥ ధాత్రిలో యెవరినిక నేనూ రమ్మిపుత్రకా యని పిలిచెదానూ। మిత్రిత్వముఁ బాసి శత్రుడావై చాల। మాతృదుఃఖమునకై మరణించితివ తండ్రి ॥అ॥ మార సమ తేజ సువిచారా। నిన్ను యెట్లు విడుతునురా కొమారా। యేరీతినిఁ విడచి యెట్లుజీవింతురా। మా. సంహారుడింత కారణంబును జేసె ॥అ॥ వసుధ కనుసాని పారీశా। యిట్టిదశ నొందగను పార్వతీశా -ఆశ నొంచియున్న అంబుజాక్షిని యిట్లు। రోసి సూనుని హింసజేసితివ పరమేశ ॥అ।౪।

### ఋషభ యోగీశ్వరుడు రావటం.



౪. శ్రీగిరిజా ప్రాణేశ్వర। నాగాజిత వాసలోక నాయక యభవా
భోగీశభూష దలతును। బాగుగ కనుసానిపల్లి భక్తాళినుతా.

### దర్వు ఆదితాళం.

శ్రీగౌరీలోలా శంకరా। శ్రితభక్త రక్షణా ॥శ్రీ॥ నాగభూషణా సందివాహనా। నాగతల్ప సఖ నాకాధిపనుత ॥శ్రీ॥ శ్వేతాంగా శంభో శశిధరా। సర్వేశ మదనహార ॥శ్వే॥ పాతకహారణా భూతశర

ణ్యా । ఫాలనయన పరమాత్మ కృపాకర ।శ్రీ॥ ధారుణి మండాలం బున । భూరిగ కనుసానిపురి । ధా । సారసమతిచే కోరినుతించిన శైవ బ్రహ్మ కృష్ణాహ్వయునేలిన ।శ్రీ॥

ప ధానివాక్యం.

కం. శ్రీపార్వతీశు మనమున । యేపా గ దలచియెపుడు యే తెంచిన వో । తాపసవర నామము । వోపికతో తెల్పునాకు ఓయి మహాత్మా.

ఋషభయోగి వాక్యం.

గీ. ద్వారపాలక వినరోరి త్వరితముగను । ధర రుషభయోగి యందురు తథ్యముగను । భూరివస్త్రా గరిష్టచే మా హరుని । ంద మందు నుతి తు యానందమొదవా.

ప్రధాని మాటలు.

ప్ర:—దేవా తాము యిట్టి సజ్జస్థలంబున యెందేగెదరో దెల్పు దేవా । మహానుభావా.

రు:—నేనిట్టి నమయంబున వైశ్యపట్టణంబు జనుచున్నాడను వినుమి నామనవి గనుమీ.

సుమతికి రుషభయోగికి వాదం. అది.

రు:—మీానవేత్రి బహుచింతచేతా । నేడ్వగాను గలిగెమిఘాత - పూని తెల్పూ । శోకమూను నిల్పూ । కాని కార్యంబు నేమి యూను గలిగెను బాల । వి దునేనూ । ముందుగాను । మేల్ మేల్ మేల్ ॥౧॥

సు:—వందనంబు మునికుంచంద్రా చిన్ననందనుడూ గుణాసాంద్రా । యిందువినూ గతి నొందగానూ । డెందాములో దుఃఖమొంం దాగ జేసె హరుడు । ఖేద యును మదిలోను । చాల్ చాల్ చాల్ ॥౨॥

రు:—నీదు నామంబు దెల్పవేచానా । ఖేదమొందాకుమా గజయాన పాదుగాను శంభు మదిలోనూ । మోదమొందిన క్షేమ మీా

ధాత్రి గలుగునమ్మ । వేఁడనాయమా । జెందికామా । మేల్
మేల్ మేల్ ॥ ౩॥

సు:—భూమిలోనా వజ్రిబాహునాకు । పెద్దభామాను సుమతిక నాకు
లేమలూను విషమిడగానూ । స్వామి యీరూపము దగాను
నాభర్త అడవి ధామముననూ । నన్ను విడిచేనూ । యే
మందు ॥ ౪॥

రు:— యింతి యింతా శోకింపవి మూ । దైవమింతా యొనర్చె
ననుమూ । కాంతవినూ సుతునింతలోనూ । వంతునిట్లుండె
నని యింతలో దాహమును । పూనగాను । జేయుచూనూ ।
మేల్ ॥ ౫॥

సు:—దీనరక్షక నావంటిహీనా । జన్మ మానీనులుండుట కన్నా -
నేను పూని తనయునితో సి । దహనమొందిన శుభమును
గలుగును క్షోణి । కనుసాసపౌరిశు నమ్మి । చాల్ ॥ ౬॥

సుమతివాక్యం. కందం.

కం. పుత్రుని నెడబాసియు నే । ధాత్రిలో బ్రతుకగను జాల
తాపసవర్యా - నేత్రముల్ నిండగాం చుచు । శత్రుండని దహనమెట్లు
చయ్యన స్వేతుర.

రుషభయోగి వాక్యం. గీతం.

గీ. నీలకేశిరో బహుగుందుటేల యిక్క । బాలనేత్రుని ప్రా
ర్థించి పరగ నూతి । బాలసుందు నిడితి నెబ్బాలు కును । మేలునొం
దగ జీవించు బాలుడిప్పుడూ.

వ. యిట్లు భస్మ బు బాలునినొసట నిడినంతలో మెల్లమెల్లగా
కన్నులు విప్పుచు పైకిజూచి నయ్యతివియని పాదంబు పైబటి యిట్లు
నియెను.

భద్రాయువు వాక్యం.

కం. వందనము తాపసోత్తమ । వందనము శ్వాదీయ పాదవారి
జములకున । (తల్లితోననుట) వందనము కన్నతల్లిరో । సందేహాను

లేక నన్ను నరగున గనుమా.

రుషభయోగి వాక్యం.

కం. ధరమార్కండేయునితరి । వరఅంజని నూనువిధిని । వొప్పగధాత్రిన్ । యిరవొందగ జీవింపుమి । హరినుత ప్రహ్లాదువిధిని హాయిగనీవున్.

సుమతి భద్రాయువు రుషభయోగి వాదం. జుల్వ.

భ:—తాపసోత్తమ పాదములకేనోపి ప్రణుతులొనర్చెదన్ । వో పరాత్పరరూప నిను నాలోపలానిక మరువజాలను । తాపమికనూ । బాపగనుమూ ॥ తా॥

రు:—భూపసుత నీయాపదలు గిరిజాపతీ యిక భాపెను -నివరీతాపంబు దీరె నుమాపతి కారుణ్యమునసూ । ఏకముగనూ । తాపము ణచున్ ॥ ౨॥

సు:—దేవమీాదు ప్రభావముననే బ్రోవనాయెను సుతుడీలన్ । కావుమిక శస్త్రాస్త్ర విద్యాప్రభావమును నెరింగింపు దయగని పాదములకున్ । ప్రణుతిజేతున్ ॥ ౩॥

భ:—కన్నతండ్రి వటంచు మది బహు నెన్నుచుంటిల చాలగన్ । నన్ను జీవితు జేసితివి యాపన్నరక్షక గురువరా తమ । నెన్నగనునా । వశమయానా ॥క॥ర॥

రు:—భువిని గొప్ప ప్రవిమల బు సనినయంబుగనూ శివా । కవచమును దెల్పెదను నీకు కనరమది సద్వినయమొప్ప । ధరలోకనుసాన్ । పురనివాసున్ ॥భు॥ ౫॥

రుషభయోగివాక్యం.

కం. బాలక వినరా నీకును । మేలిమి గలిగించునట్టి మేదినిలోనన్ । చాలగ విద్యలు గరిపితి । నీలో నను మరువబోకు నీరయందున్.

భద్రాయువువాక్యం.

క. గురువర నీచరణంబులు-మరువను నామనమునందు మాన్యచరిత్రా పరమానందంబాయెను।మరినాకు బలంబుగల్గె మహిలోనిపుడున్.

వ. ఇవ్విధంబున నారుషభుండు మరణించిన భద్రాయువును బ్రతికించి అస్త్రశస్త్రవిద్యలన్నియు నబ్బాలునకు నుపదేశించి యెంచేవి బోయినంత.



## కీర్తిమాలిని రావుటం.



క. శ్రీలక్ష్మీరమణార్చిత । ఫాలాక్షా పాపహరణ పార్వతిలోలా
బాలేందుధరా బ్రోవుమి । చాలగ కనుసానిపల్లి సాంబ మహేశా.

దరువు రూపకం.

శ్రీకంఠా । శ్రితజనపోషా । లోకేశ్వర మన్మథహార ॥శ్రీ॥ ప్రాకటగతి నెమ్మదిలో నేకంబుగ వేడెదహార । నీకుగా మొక్కెద బ్రోవుమి । నీరజనాభ సదాశివ ॥శ్రీ॥ ఫాలాక్షా పరమపురుషా । పాపాసుర మదశిక్షా ॥పా॥ ఆలంబున యసురాళిగా గూలించియు కరుణతో ముని । జాలంబుల లక్షించిన బాలేందుధరా పురహార ॥శ్రీ॥ గౌరీశా గజచర్మధరా । కైలాసాద్రి నివాసా ॥గౌ॥ సర్వేశ్వర నీపద సత్చరణంబులు మరువను నే । యూర్విని కనుసానిపుర వరనిలయా మాం పాలయ ॥శ్రీ॥ ౩॥

చెలికత్తియ వాక్యం.

క. కలికీ చిలుకగా బోలిన । పలుకులు మృదువైననోట బలు

కుచు యిటనిక - అలివేణి వచ్చినావిటు । జలజాక్షిరో యెవ్వారమ్మ చయ్యన సెపుమా.

కీర్తిమాలిని వాక్యం.

కం. కోమలి నూవాతకాయు నిజ । నావుంబును సయముదనర నాతిరో నీకిక । ప్రేమను వినుపించెదను । యీ మహిలో తెరను వెడలి యింపలరంగ.

తెరవెడలుట. దర్వు ఆది

భామానే । వయ్యారి ముద్దు । లేమానె । వోయమ్మ । భామాను విను గజగామియనుచు యీ । భూమిజనులు ఘనపేరుచే బాగుడెటి ॥భా॥ ॥ యింతినే । చంగల్వ పువ్వు-బంతినే । వోయమ్మా కాంతకోడను సంతసమూన పూల । బంతులు నాడెటి శాంతనుగను గొన ॥భా॥ బాలానే । కనుసానివలి । లోలూనే । వోయమ్మ । బాలేందుముఖు ని చాలగనమ్మిన । శీలను కాంచనమాలధరిచి విచు ॥యి॥

కీర్తిమాలిని ద్విపద

వోచెలి వినవమ్మ వొప్పుగా నికు, దాచక దెల్పెద దావంత మేలా, నిషధపట్టణము మా సలయుంబుసుమ్మి, విశదకీర్తి ప్రభావలసి తుండైన, చంద్రాంగమహారాజు జనకుండు కొమ్మా, యింద్రవైభవ ముచే యేలు జగమంతా, వ్యోమకేశుని భక్తియొనరించునట్టి, సీమంతినీదేవి పేరుమతల్లియును, వారిద్దరికి నేను వాంచతోడుతను, కూతెమి సుతేనయ్య కోరిండ్దీరా, మహియింకినిను కీర్తిమాలిని పేరు, పరిణాము సుముఖినె వకమేళు నెప్పుడు, సిరితము వేడుమ నిటు వస్తినమ్మ॥

కీర్తిమాలిని దర్వు - ఆదితాళం

ప్రోణిలో కీర్తిమాలిని నామాము విను కొమ్మా । మానిని నిషధపురి మానివానాముమ్మ ॥౧॥ నీరజనేత్రిని విను నిరుపామగాత్రిని । ఘనుడౌ చంద్రాంగదు కూరిమిపుత్రిని ॥౨॥ చెంగావిచీర బహుగచింగు జెల్లాడగాను । రంగుమీరినట్టి రవిక దొడిగితినమ్మా॥౩॥ మాణిముత్యంపు

సరులు పూని దాల్చితి మ్మా । ఏణాక్షి శివభక్తి మానా వినవేకొమ్మా ॥౪॥ వసుధ కంసానిపౌరి విపక్షంతు నెప్పుడు । పొసగ వేడినట్టి పొల తిని విను కొమ్మా। ౫॥

## కీర్తిమాలిని వాక్యం

కం తారేశ్వదనరో నామది, కోరెను వనపుష్పములను కూరిమి తోడక, సారసనేత్రిరో గోయను, నారిరో చెలులంత గూడి నయ ముగ రారే.

## చెలికత్తియ వాక్యం

గీ. మానినీమణి వనముకు పూని యేగ, గాను సీతల్లిదంద్రులు మానసమున, తనయ యెక్కడి కేగెనో యనుచు చాల, పూని శ్రమ నొందుచుందురు పువ్వుబోణి.

## కీర్తిమాలిని చెలికత్తియ వాదం - ఆది।

కీర్తి:—సుందారి పుష్పవనము సఖు । లందారి గూడి నేగను । డెం
దాములో కోర్కె ముందు గలిగె సఖ ॥సుం-౧॥
చెలి:—యి దూను ఖు వనములో బహు । సుందారాపురుషు । లుందు
రు । ముందుగ మోసమొందగ జేయుదురు ॥యి-౨॥
కీర్తి:—కలికిరో మనము యెవరి । కన్నూల కగుపడకనూ । విలసీతమగు
పుష్పములు గోనివత్తాము ॥క-౩॥
చెలి:— రిణాయమునుగాని మృదు । తరుణీ నీవిలు వెడలుటా । మరి
పాడిగాదమ్మ మానుమి యీవార్త ॥౪॥
కీర్తి—వేగిరమున నేగియు నట । జాగూసేయాక మరియును । బాగుగ
వత్తాము భోగీధరుని వేడి ॥౫॥
చెలి:—యి మించూ కంసానిపురి । లలనా కరకంటు నమ్మి । అలి
వేణి నీమనసు అట్లయిన పోదాము ॥యి-౬॥

వ. ఈవిధంబున నాసఖీజనంబులు గూడి వనవి తలం గనుచు నిట్లనియె.

కీర్తిమాలిని వాక్యం

కం. సఖియరో యావనమందున । శుకములు ఘనమైన ధ్వనులు సొంపుగ జేయున్ - యికజూడు చెలియ పువ్వుల । నికరంబుల్ వింతగొల్పు నిటుగాంచు తరిన్.

చెలికత్తియ కీర్తిమాలిని వాదం ఏకం.

కీర్తి:—అందాముగా వనాసుందారామును గనా ॥అం॥ డెందాము లోనా సంతసమొందగ నాయె నేడు ॥అ-౧॥

చెలి:—సొంపారుచుండునట్టి సంపెంగ పుష్పామూలు । యింపయ్యె నట్టి మల్లెగుంపుల జూడు నేడూ ॥సొం-౨॥

కీర్తి:—ఫుల్లాబ్జనేత్రిరో యీనల్లాని కలువలూనూ - అల్లాచుదండాలు అన్నియూ మెల్లాన వేయూదాన ॥౩॥

చెలి:—అంగాన మణులంతా సంగాతిగానూగూడి । పుంగిడి బూయు దామ శృంగారా మొదవాగాను ॥౪॥

కీర్తి:—వింతా వింతాగ పూలా బంతూలు నాడుదామ । సంతోష మునా కోలాలింతాలో వేయిదామ ॥౫॥

చెలి:—కోమలా గాత్రులంత వోమన్నాగుంతాలును । ప్రేమాచే నాడూదామ భామాలందరుగూడ ॥వో-౬॥

కీర్తి:—కుతుకంబూతోడూ, బతుకమ్మలాటలాడ । కు । సతిమాణూలందారు సమ్మతితో నాడారెకొమ్మ ॥౭॥

చెలి:—యిలయందు కనసాని । పల్లివాసూని పూని । యి । కలకాలమేలు నీవాకంపెరుడై బోచ్చిచునమ్మ ॥యి-౮॥

వ. యీవిధంబున నాకీర్తిమాలిని తన చెలులతో నాడుచున్నంతలో భద్రాయువు తన చెలికాండ్రతో నిట్లనియె

భద్రాయువు వాక్యం.

గీ. వోయి చెలికాడ వినుమోయి వొప్పగాను । ఆయుధంబులు చేకొని యతిరయమున । పోయి వన వేటనల్పియు శ్రీయుతముగ । మళ్ళివత్తాము కోర్కెయు మదిని గలిగె

వ॥ అపుడు మంత్రిశేఖరుడు తల్లియాజ్ఞగొని వేటకు పోవలయు నని భద్రాయువుతో చెప్పుటయు తల్లివద్దకువచ్చి భద్రాయువు యిట్లనియె —

సుమతికి భద్రాయువుకు వాదం చౌకం,

భ:—తల్లిరో వినవె నావుల్లమందు వనా। మెల్ల దిరుగా నేడు। వో
మాత। యెల్లదిరుగా నేడూ॥౧॥

సు:—వుల్లములోన యిట్టి చెల్లానికోర్కె బూన చెల్లాదురా తనయా
వోసుతా। చెల్లాదురా తనయా॥౨॥

భ:—సూటిగ నామది వేటలాడుటకును నాటెను మదిలో కోర్కె।
వోమాత। నాటెను మదిలో కోరికె॥౩॥

సు,—వేట పానంబు జూద మాడతగదంచు। మాటికి బుధులు దెల్ప
వోసుతా। మాటికి బుధులు దెల్ప॥౪॥

భ:—పూని మృగవేట సల్పగాను రాజులకును। మానిని చెల్లానటే।
వోమాత మానిని చెల్లానటే॥౫॥

సు:—భానుప్రకాశ నిన్ను పూని పొమ్మనగాను నా మన మొప్పా
దురా। వోసుత నామనమొప్పాదురా॥౬॥

భ:—బాణసంధానునకు కాననమందునైన। పూని యేశంక లేదె।
వోమాతా। పూని యేశంక లేదె॥౭॥

సు: క్షోణి కనుసాని గౌరి ప్రాణనాధుని వేడియూను నేగూమిపుత్రా
వోసుత వేడియూను నేగుమి పుత్రా॥౮॥

సుమతి కందార్థం.

నందన నీవిక క్షేమము। నొందగ వనవేటసల్పి। యుత్సాహముతో। కందర్పగాత్ర రమ్మిక। సందేహాము బొందకిపుడు॥దరు॥ జనుమీా యిక వేగిరంబుగాను। వోతన[illegible] యూనూ। వనమృగముల నెల్లా దునిమీాయు [illegible]జననీని మరువకాను తనయా వేగాను రమ్ము॥జను॥

భద్రాయువు కందార్థం.

హోయమ్మ పోయెదను యిక § పాయక మదిలోన మృడుని ♦ ప్రార్థించియునే ♦ తోయజనేత్రిరో త్వరగా ♦ నీయభిమత మొందునట్లు ॥దర్వు॥ నేగి త్వరతిరిగి మళ్ళియూను § కరుణ జూగూ సేయూక వేడ్కతోనూ § బాగయిన రుషభమూని యోగీశ్వరూని దలచి ♦ బాగయిన అశ్వ గజా భట బృందాముల తోడుత ॥నె-౧॥

భద్రాయువువాక్యం యేకం.

మంత్రీశ్వర ఘనసంతసమున మనకాంతారమునకు । నేగాను వలె యూవింతాలు గనుటూకు । కాంతవైరినిక మంతనమందున । చింతెనజేయుచు శీఘ్రతరంబున ॥మ-౧॥ బాహుబలంబున జవగల్గిన కదుస్సవాకూలూనుగా । వెటూనడువాను శీవి చెన్నొందగా । వాయువుసరి బల్బొవు రథంబును । జేయుము సిద్ధము బోవలెత్వరగను ॥మ॥ సుందరాక్షి పురి మందిరు మనమున నందముతో డానూ । పేడూచు మదిలో యిందూధరు నెప్పుడు । తొందరచేతను ముందుగజని యూసందడి మృగముల కొందలజే ॥మ-౩॥

భద్రాయువు వాక్యం,

గీతం, వినుమి సఖ నేడు యిూ వనమునకు నాదు ♦ జననియాజ్ఞచే వేగనూ జేరీతిమి ♦ గనుమి యిూ వనతరులన్ని కాంతుతోను ♦ గనుటచే చాల సంతోషమును జనించె.

భద్రాయువు వనవర్ణన యేకతాళం

కనుగొనుమా ఈ వనమూ మంత్రి ఘనతరమైన విచిత్రమూగాంచగను మది బలు కనులాకు నేడానందము । జనియించెను యిూ వనపుష్పంబులు । ఘనవాసనచేతను వికసించెను ॥క-౧॥ కోకిలలంచల నేకంబుగనిట । పాకటమొప్పగ పక్షివర్గములు । కూకలొనర్చెటి కాకి గుంపులును । శుకములు నదులలో బకములు గలిగిన ॥క-౨॥ శిరమున శృంగం బిరవొందిన యూమరి సారంగము లరుగుచున్నవి । తెరువును ద్రప్పియు నరుగుచునుండెటి । చిరుతపులుల గను సరగున మంత్రిరో ॥క-౩॥ మల్లెగుంపులకు మెల్లనదూరెటి । నల్లని సారల పిల్లి

గుంపులును । తాళ్ళవనంబున భల్లూకములును । పేళ్ళగుంపు కుందే ళ్ళుగలవు యిట ॥క-౪॥ యిల కనుసానిపల్లి కిలకఁటునిపద । జలజాతం బులు కలకాలంబున । దలచీ యీ వనముల నెల్లను బలు । బలువగు మృగముల చెలగిద్రుంచితిమి ॥క-౫॥

వ॥ ఈ విధంబునా వనంబున గల వింతలన్నియును గనుచు మార్గాయాసంబు దీరుటకయి నొక దివ్యవృక్షంబు క్రింద విశ్రమించు నంతా—

హైమరథుండు రావుటం.



హైమరథుండను రాజు రావుటం.

కం. శ్రీపార్వతి నాయకహార । గోపాలనుతా పురారి గోపతి గమనా । దావయ్యా మమ్ము నేలవె । తాపసవర మదిని చాల దల చెద వేగ౯.

ప్రధానివాక్యం,

కం. మేరుమహీరుహ ధీరత ♦ సారసముగ వచ్చు ఘనులు చయ్యన మాతో । వేరొయ్యదా వచియింపుడి ♦ కూరిమితో నందు నేను కోరికదీర౯.

దరువు చెల్తితాళం.

హే:—అవనిలో వినరోరి హైమరథుండాని బహుకీర్తిన నొందిన బలుడానురా। విపరాముతోడా నావిధమంత నీకును। సవినాయ మెసగాగ చక్రాంగదెల్పెద ॥అ-౧॥ భండానమందూన దండీగ శత్రుల ఖండించి వైచెటి ఘనుడానురా। గండుమీరి దోర్దండాముచే బ్రహ్మాండమంతయు పిండి పిండిగ జేతును ॥అ-౨॥ శ్యామపురంబును ప్రేమాతో నేలేటి భూమీశుడనురా। రణభీమూడరా। నేమాముతో శచిరామణుమించిన। వేమారుపైభవ మిామాడ్కి చెన్నొందు ॥అ-౩॥ ధారుణిలో దీనగణమూల బోచిన శూరుడ సుహితా విచారుడరా। ధరణి కనుసానిపోరి ధాముడయిన త్రిపు। రారి నెమ్మదిలో నేమారాక వేడేటి ॥౪॥

హేమరథునివాక్యం. మత్తకోకిల.

ద్వారపాలక నేను మనమిా ధారుణీ స్థలినంతయున్
ధీరతో చరియించి మళ్ళియు జేరవత్తమ పౌరికిన్
శూరతన్ ఘనశత్రులన్వడి మారణం బొనరించియున్
భూరిగా జవగల్గినట్టి ॥దర్వు॥ వారు మనవెంటా నడువగా
వెళ్ళామి దేశాచారంబు గనుటా కింపుగా
వారణముల్ బలుతేరునుసిద్ధము మిారు నేయుడికధీరత తోడుత
ధారుణీశ్వరు లెవ్వరున్। వచ్చినగాని పోరుజేసెద యింపుగన్

ప్రధాని వాక్యం. మత్తకోకిల.

ముందుగను తమయాజ్ఞకూ నేనుందు హైమరథోత్తమా। సందేహంబును లేక తీవ్రము స్యందనంబును దోలెదన్। అందముగ రవికాంతి చెన్నొందియు సొంపారగన్। సుందరాధిప పట్టణంబు ॥ద॥ యిందుగలదూ మదిగాంచగా। నేత్రంబులా కాసందకరమయ్యె। తోచెగా। అందముగను పురమందు గలుగువా। సుందరుడెవడో

యిందు నుడువుమి । విందూను దెల్పూ వేగనూ । సంతోషమునా ।
డెందాము సంతొసించదనూ ॥స-౨॥

హేమరథుడు పంచచామరం.

చాపమూలబూని మనము యీ పురంబుజొచ్చియుం
భూపతీనిబట్టి హతము పొందుగా గావించియుం
యేపుమీర కోటలన్ని తూపులాచే దునిమియుం
యీ పృథివిలోన జయము యింపుమీర బొందెదన్.

సంధివచనం.

ఈ విధంబునా పురంబుజొచ్చి భూమి అదురునట్లు ధ్వనులు జేయుచు డినంతా సత్వవంతుడు భూమికాంతున కిట్లులనియె

ప్రధానివాక్యం.

గీ. ధరణినాయక యెవ్వడో ధైర్యమూని । పురముజొచ్చియు ధీరత పొందుగాను । పురిలో కోటలు గూల్చెను పుణ్యచరిత । దుర మునను వాని దృంచుడి దోర్బలమునా.

ప్రధాని వజ్రబాహువాదం దర్వు ఆటతా.

వ:—యింత మనముచేతను యినుమంత దెలియలేక పురముకింత
లోనె గను । వానినంతు బాపెదన్ । యింతా । వి తా
దెంతా ॥౧॥

ప్ర:—నూటిగా రిపులాను బట్టి గీటడగించగ మేటిదొర నీకెటి యుద్ధ
మునూ । నీతోటి సమము నెవ్వాడు । లేడూ । చూడు ॥౨
వ:—ఉరమునందు గిరిజధవుని త్వరగవేడి శరముబూని నరుగుదమం
దూ।ధరా కీర్తిచెన్నొందూ।అందూ।ముందూ।కందూ ॥౩॥

ప్ర:—ధాత్రిలో కనుసానిపల్లి త్రినేతుని ఘనస్తోత్రమును తాత
పులాను । యీ ధాత్రి గూలగనూ । బూనా । గానూ
వినూ ॥౪॥

హేమరథునితో వజ్రబాహుండనుటా.

గీ. వారి క్రూరత్వమున యిటకుజేరి బహుగ । శూరతన్గన ప

చియు ధీరమతివై । మొరుగుచున్నావు మూర్ఖుడా ముదముతోడా । పేరు దెల్పర వధియింతు కూర్రసిన్నా.

హేమరథుని వాక్యం.

గీ హరి నెదుర్కొను జంబుకా సరణి నీవూ । గందు మీరిటు వచ్చేవు గర్వమణతు । వచ్చె ననుకొమ్ము కాలుండు వసుధపైకి । భూమి మగధాది నాథుండ హేమరథుడా

సంవాదం ఆటతాళం.

వ:—కూర్రాత్మ నిన్నుబట్టి మారాణ మొనరింతు శూరాత జూపాకు ధారుణీపై । పేరు వజ్రబాహు ధారుణియందున । నీరూపు మాపెద సార శరంబూని ॥ ౩॥

హే:—దొరనంచునూ చాల మరి నీల్గబోకుమి కరవాలంబుచె నిన్ను ఖండింతురా । హరి హరులందారు యుద్ధాముఽచ్చిన । సురజ్యేష్టుడొచ్చిన చూడు నిన్ను విడువాను ॥ ౨॥

వ:—దబ్బారమేలను మబ్బాదలింతు నీయబ్బాకు విడుతూన నుబ్బాకురా । తబ్బిబ్బులాడాకు తగ్లెద యమపూరి । దబ్బూసముఽలు నీదర్పమడంచెద ॥ ౩॥

హే:—పట్టుబడితివికా ఘట్టిగనిన్ను నేనట్టెరథమునాకు గట్టెదరా । దిట్టముగను నీదు చుట్టునేనలుండ । గట్టిగ కనుసానిగాద్రిమే శుక్రృవతోనూ ॥ ౪॥

వ. ఈ విధంబునా రథంబునకు బంధింపగా వజ్రబాహుండు శోకాతురుడయి పరమేశ్వరునిగూర్చి యిట్లనియె.

వజ్రబాహు వాక్యం.

కం. యెంతటి కార్యంబాయెను । పంతఃబున శత్రుడిపుడు పట్టుకపోవన్ । యింతలో పాలింపవె నను । శాంతమతిఁ దయను జూడు శాంభవి లోలా.

దరువు ఆటతాళం.

సర్వేశా జగదీశా పార్వాతినాయక । యూర్విలోనను బ్రోచె

వారు యిక నెవ్వారయా ॥౧॥ ధాత్రిలో నన్నిటులా శత్ర్యాదు బంధి వ
య్యేత్రోవ జనుదూను నేనూ । యెలమితోను ॥౨॥ విడిపించరే నన్ను
పుడమిాశులెందయిన । అడవియందుండిన రారే బ్రోచిపోరే ॥౩॥
భూమికనుసానిసారి స్వామిా నీమదియందు । ప్రేమదప్పియు నింతా
నాయా యేమి శాయా ॥౪॥

వ. ఈ విధంబునా మహారణ్యంబులో జనుచున్నంత న ట
భద్రాయువు సఖునితో యేమనుచున్నాడన.

భద్రాయువు మాటలు.

భ: — సఖా యిా నిర్మానుష్య ప్రదేశంబున । గొప్పధ్వని వినబడుటా
నాకు కారణంబేమొ అరసిరమ్మి వేగలెమ్మి.

ప్రధాని వాక్యం.

కం. యెవరో యెవరిన్ బట్టుక । భువిలో జనుచున్నరనుచు
పొందుగ నేడ్వంగ । జవతోడ నిప్పుడేగియు । బవరంబొనరించి వాని
పాలించు సుమిా.

భద్రాయువు మాటలు.

భ:— నేనిదె చూడు వానిని రణర గంబున గూల్చి అర్థిని రక్షించెద
చూడు నాప్రజ్ఞ నేడూ.

హేమరథుడు భద్రాయువు వాదం జంపెతాళం.

భ:— క్రూర నిలువు నేను చాలదొరనుయాని నీల్గియువడి । నరిగెద
వెచటికి దెల్పరా । క్రూరా । మేరా । యారా । వినవేరా ।
కనవేరా ॥౧॥

హే:— తెరువుదప్పి మొరుగబోకు చిరుత నిన్ను బట్టియునే । నరికిన
దిక్కెవ్వడురా । యేరా । రారా । పోరా । జనవేరా । మరి
తీరా ॥౨॥

భ:— మొండి తనముచేత నీల్గుచుండి నాతో సరియటనుచు । గండు
మిారి పలికిన యిపుడూ । నేడూ । చూడు । జోడూ । సరి
లేదు । విను నేడూ ॥౩॥

హే:—బాల నీవు నాలమునను నిలిచినన్ను గెలిసేయగ । జాలవు మరలిక పోపోమ్మి । పొమ్మి । నమ్మి । లెమ్మి ॥ కనుగొమ్మి । వినునుమ్మి ॥౪॥

భ:—ప్రాణము చేబూని యిపుడు హీనుడా నిను దృంచెదనిక । మా నమి యీ మంకుతనమురా వినా । గాను । నేనూ । కను గొనూ । విడువాను ॥౫॥

హే:—భూమి శ్రీకనుసానిపల్లి సోమశేఖర యిటులనన్ను । భూమిపైని బడగ జేసితివా । దేవా । బ్రోవా । రావా । కనుగోవా । మహానుభావా॥౬॥

హేమరథుని వాక్యం.

కం. యుర్విలో బలశాలిని యని-గర్వించి మెలంగ యిట్టి కార్యము నాయెన్ - సర్వేశ్వర యీ బాలుని - శౌర్య బును జూడ గాను శంకయు గలిగెన్.

సంధి వచనం.

ఈ విధంబున హేమరథుండు భూమిపైబడి మూర్ఛజెందినంత తదనంతరంబు భద్రాయువు వజ్రబాహున కిట్లనియె.

వజ్రబాహు భద్రాయువుల వాదం ఆటతా.

భ:—అనఘాత్మ । ఘనవందనము నీకూ ॥అ॥ వినుము నొకమాటా ॥అ-మిత్ర॥ జనుమి వేగిరమునను గృహామునకు అనుదినము హారునమ్మి నాత్మలో । ననుః గన్ రథ గజ పదాతి జనులు వెంటా జనుచు నుండగ । విను నాదు మనవీ ॥అ-॥

వ:—పరులానూ । బ్రోచిన దొరవు నీవూ ॥పరు॥ నీసరి యెవ్వరై నా ॥ప-మిత్రి॥ ధరలోపల పరుల బ్రోవను హాహారాదుల కరుణ గలిగియు । చిరుతరూపము దాల్చి యిచ్చటి కరుగుదెంచెరో నరయు జాలను మరి మీరు యెవరూ ॥ప-౨॥

భ:—పుడమీశా । వినుమీ నా నామమునూ । ధరా భద్రాయు వుండా ॥పు-మిత్రి। తడః కను విను నుడివెదను యీ పుడ

మిలో సిరిబడయు వైశ్యా । పుడమిరేడను వాని యింటా కడు
ముదము వసియింతు విచుమా: జ౯ని యుక్తముగా ॥పు-3।

వ: —నినుగన్న । వారలు యెంత ఘనులో ॥క॥ కనగా సంతసమా
॥ని-మిత్ర॥ వినయమగు కనుసాని పురిలోపలను ఆలయమునను
అద్రి । తనయులోలుడు నీకు క్షేమకరము నొసగును పోయి
వచ్చెద । ఘన పుణ్యచరితా ॥ 3॥

సంధి వచనం.

ఆ సమయంబునా వజ్రబాహుండు ౯జస్థానంబునకు జనిన
భద్రాయువుండు నొక్క కన్యకను గాంచి తన సఖునితో నిట్లనియె.

భ: —సంతోషమూన సఖ యింతలో గనుము యిక । సంతాన
మొనరించు వింతా గనుపించే ॥స-౧॥

మి: —వినయాత్మ నీకేమి ఘనవింత గనుపించె । మనమూన సంతో
షమును జెందుచుంటివి ॥వి-౨॥

భ: — చక్కని కీవిగల దక్కడగనుము యిక । చుక్కలధిపుమించు
చక్కని సుందారిగ ॥ 3॥

మి: —వరకాంతల నపేక్ష బడుటేదియు చాల । మరి పాటిగాదింక
మానుమి యీవార్త ॥ర॥

భ: —ఆ రమణి వద్దికిజేరి మనమిప్పుడూ । పేరెయ్యదో వీక్షింతమ
సారాసా మొందాగ ॥ఆ-౫॥

మి: —భువిని కనుసార పౌరి ధవుని నమ్మియు నేడు । అవనీశ పదు
మిాక అట్లయిన తీవ్రంబు ॥౬॥

భద్రాయువు వాక్యం.

సీ కలికిరో నీకురుల్ అళిమించి యొప్పునే । చెలగి మోమును
గాంచ చంద్రుడనగా । ఘనముగా శింగిణీలనుబోలు కనుబొమల్ ।
కనులు వీక్షింపగా కమలసమము । తిలపుష్పమును బోలు అలివేణి
నాసికం । అతివకంఠము శంఖమనగనొప్పు । కరివైరిమించినా తరుణి
నీమధ్యంబు । అరటుల మించునీ అ కయుగము ॥ తే॥ నిన్ను యెన్నగ

వశమానె నీరజాక్షి । కలికి నీసుందరమువంటి కన్యలెవరు । కలరె నీ వయిని నా మది గలిగెవాంఛ । పణతి నాతోను భాషింపు పద్మ గంధీ——

కీర్తిమాలిని భద్రాయువుల వాదము.

భ:——సారసాక్షిరో ధారుణిలో వో సారిమణి నీవెవ్వరే । పేరుదెల్పవే కోరకలరా మారసతిసమ సుందరీ ।సుందరి ముందుగ అందము గలుగనె ॥౧॥

కీర్తి:——మారసుందర నారులుంకు శృంగారవతికి యిట్టులా । పూరుషులు రాజెల్లునా యిక మీరు ధర్మము నెరుంగరా । వాదము యేలను పాదుగ నాతో ॥౨॥

భ:——కలికిరో మృదులోలుకగా యిక బలుకవే శృంగారిణీ । తళకు నీనగుమోము గాంచనె । చెలనమొందెనే భామినీ ।చూడుమి నేడును చేడియ నన్నూ ॥క-౩॥

కీర్తి:——పరసతూలను గోరుటాకు పాతకంబని తెల్యవా । సరసమాడు కేలనూ త్వర । మరలు వచ్చిన దారినీ । యేటికి యిట్టుల మాటలు పొమ్మి ॥౪॥

భ:——సుదతిరో విను మదనుడూ నామది వేఘాచున్నడె । మదవతి సమ్మదముతో నా హృదయతాపము దీర్పవే । మానిని యేను నిన గాంచినంతనుంచి ॥సు-౫॥

కీతి:——మోసకాండ్లిక దేశమందున నీసరి బహునుందురూ । భాసుర కనుసానిపొరి యీశుని స్మరియింపుచూను । సారసమొంద నీ పేరిట దెల్పు ॥మొ-౬॥

భద్రాయువు వాక్యం. కందం

భద్రోభయాన వినుమిక । అదిసునీసుండ వినుమి అవనీస్థలిలో
రుద్రుని ప్రియభక్తుండను । భద్రాయువనంగ పేరు బరగిన వాడన.
కీర్తిమాలిని భద్రాయువుల వాదం. ఆట.

కీర్తి:——ముందుగా యిపుడూను ॥జ మందిరమునకూను ॥ముం॥సుం

దాకినేగియు ముందుగ జనకూతో సందేహమును దెల్పి గుందితమితనీ ॥౧॥

భ:—కోమలామికయేలా నను ప్రేమజూడుమి బాలా ॥కో॥యేమాని యంటిని తామస మొందేవు। సామజగమనా నీ నామామునుడువుమీ ॥౨॥

కీర్తి:—వార్త దెల్పెద నేను ధర కీర్తిమాలిని వినూ ॥వా॥ ఆర్తిజన రక్షకుండు దురితాదూరుండు। కీర్తి చంద్రాంగ భర్తాకు పుత్రిని ॥వా-౩॥

భ:—మగువ నేడు చూడు బల్ తగునె మనకు జోడూ। మ। వగ లాడిని చిన్న బిగుకుచముల్ జూచి యిఘు తాళజాలాను మగువ చేపట్టుమి ॥౪॥

కీర్తి:—మేరగాదిక నీకు నన్ను కోరి ముట్టగరాకూ। ధారుణిలో పర నారులతో యిట్లు సరసంబులాడుట చాలు చాలికపొమ్మి॥

భ:—ఓసఖి వినూ నిన్ను కృపజేసి అజుడుమున్నూ। జేసెను నాకయ్యో భాసుర కనుసాని పురీశుని నిమ్మి నజేసికొమ్మిక పెండ్లి॥

భద్రాయువు కీర్తిమాలినికి సంవాదం జంపెతాళం.

భ:— యింతిరో యిక వంతమేల కాంతుకేళి సల్పుమా.

కీర్తి:—శంతసింపుచూను నాతో సరసమాడ రాకుమా.

భ:—కోరియుఃటి నారి నన్ను దూరమింక జూడకే.

కీర్తి:—దూరముండి మాటలాడు జేరరాకు చెంతకు.

భ:—ముద్దుబెట్టుచూను నాతో ముచ్చటాడవే

కీర్తి:—వద్దువద్దు బుద్ధిహీన వాంఛలేల పొమ్మి

భ:—కోమలమేలను తామరసాక్షి.

కీర్తి:—నామనమందున ప్రేమలేదంటి,

భ:—కాటుక కన్నుల పాటలగంధి.

కీర్తి:—యేటికి యిట్టుల మాటలు చాల్ చాల్.

భ:—సఖియ నాతో వాదా.

కీర్తి:__యికను పోవరాదా.
భ:__రమ్మి రమ్మికర్-
కీర్తి:__పొమ్మి పొమ్మికర్.
భ:__రారాదా.
కీర్తి:__పోరాదా.
భ:__మేల్ మేల్.
కీర్తి:__చాల్ చాల్ ఛీ.

భద్రాయువు వాక్యం.

కం. గంధర్వ వివాహము నిక । సుందరి మనమాడి బహుంగ సొంపుదలిర్పర్ । అందముతోడను క్షత్రియు । లందున గలదిట్టి నేమ మంబుజ నేత్రి.

సవాదం ఆదితాళం.

కీర్తి:__జననాథా నా జనని జనకులతో మంవినిగొని నేను । నేదెల్పక నను పెండ్లియాడూ ॥౧॥
భ:__ఓ తరుణీమణి మాత పితరులును ఖ్యాతిగ యేపురిలో । వసింతురో నాతోడను దెల్పు ॥౨॥
కీర్తి:__నిమథపురంబును పశుపతి కృపచే వశవర్తి యేలూ ।చంద్రాంగద వసుధీశ్వరుడూనూ ॥౩॥
భ:__ప్రేమజెందితిని సామజగమనరో భూమి శ్రీకనుసాని । పౌరీశుని నా మదిలోనమ్మి ॥౪॥

కీర్తిమాలిని వాక్యం.

గీతం. పుష్పశరరూప పోయెదా పురముకిపుడు । జేరుమచటికి నీవు శృంగారమొప్ప । సరనముగ తండ్రి యాజ్ఞానుసారముగను । పరిణయంబాడుమిక నన్ను పార్థివేంద్రా.

వ. ఈ విధంబునా నొండొరులు మాటలాడుకొని వారివారిస్థానంబులకును జేరిన తదనంతర బు భద్రాయువు తన జననితో నిట్లనియె.

భద్రాయువు వాక్యం.

కం. మాతరో వందనమిక నే•జేతును కడుప్రీతిదనర క్షేమము తోడన్ – ఖ్యాతిగ వనివేటయు సం • ప్రీతిచె నాడియును వస్తి ప్రేమన్ గనవే.

సుమతి వాక్యం.

కం. తనయా నీవిక వేటకు। జనియును క్షేమమును దనర జయమొందగనూ। దినకర తేజా మళ్ళియును వచ్చినవాడ వౌర యో సుకుమారా.

చంద్రాంగద మహారాజు రావుట.



కం. శ్రీగౌరిలోలు శశిధరు। బాగుగ మదిలోనవారుని భక్తి తోనెపుడున్। బాగుగ కనుసానిపౌరి। నాగవిభూషణుని దలతు ననవరతంబున్.

దరువు ఆదితాళం.

మీరునగ సమధీరుడన్ మణిహార శోభితుడన్। ధారుణీస్థలియందు శత్రుసంహార భుజబలుడన్। కూరిమిన్ సొంపారునట్టి। ధీరతన్ చెలంగ నిషధపౌరి నేలుచుందు వినర।మే-౧॥ రంగుగమినా నామము చంద్రాంగదుడు వినరా।అంగనామణియగా సీమంతి నర్ధాం

గియును వినరా । పొంగుచు శీవిచెన్నొదు । మంగళాంగు డనుచు జనసంఘమూాలు గొలుచుచుండ ॥మె-౨॥ దండిగను రవివంశవణి ప్రాచండ శక్రముడా । వందితులచే శాస్త్రములు వినుచుండు వాడనురా । నిందు కనుసానిపొరి వాసుః । అండబాయకాను నేలు చుండుమాని వేడుకొనుచు ॥మె-౩॥

చంద్రాంగదుని వాక్యం.

కం. వినర ధీవర సువిచార వేద్కమిూర । కీర్తిమాలిని లగ్నంబు కేవలముగ । జేయుకోర్కను బుట్టెను శ్రీయుతముగ । పుడమి వేల్పుల రప్పింపు నడిగిచూతు

ప్రధాని వాక్యం.

కం. ధరణీశ్వర నేగియునే । సరగున భూసురుల వేగ సంతోషమునః - కరుణాకర మిూ వాక్యము । బిరవుగ శిరసావహించి యిటు దోడ్కొని తెత్తుః.

సంధి వచనం.

ఈ విధంబునా జనుచు న్న సమయంబునా ద్వారంబులో నిలిచి యున్న రుషభయోగినిః గాంచి ద్వారపాలుం డిట్లనియె.

ప్రధాని మాటలు.

ప్ర;—దేవా తాము యెవరో యెందేగుచున్నారో మిూ నామంబెద్దియో తెల్పూ నామది నిల్పూ.

రుసుభయోగి వాక్యం. మాటలు.

రు:— ద్వారకా మన్నామంబు రుషభయోగి యందురు నేనిదె చంద్రాంగదమహారాజువద్దికి జనుచున్నాను గనుమిూ వినుమిూ.

చంద్రాంగద రుషభయోగి ప్రధా-వాదం ఆట.

ప్ర:—ధరణీశ్వరా వినుమిూ నేడూ । వృషభ వరమాని యేతెంచె మరి నేడూ చూాడూ ॥ధ॥ యురముననందున గిరిజధవునిః మరువకను సరసాత్ముడయితా । సరగునా యిటువచ్చె నా కేసరణి మరియు నడుపూ ॥ధ ౧॥

చం:—నడుగూదా మిపుడూ వేగంబూ । యూ కరుణాత్ముడగుమాని

వరుని మోదంబు ॥న॥ పరిమెళంబగు అగరు గంధము మరియు బిల్వా పత్రిచేతన్ । చరణములు పూజించి యతివరు కరుణ గొని దోడ్తెత్తమా యిటు ॥న-౨॥

చం:—వందాన మిదుగో మునిచంద్రా । పాదా బృందాములకు నేడు వరసుగుణసాంద్రా । వ । అందమగు సింహాసనాగ్రము నందుజేరు ముకుందప్రియ నుత । గంధమాక్షత పుష్పములు గొని పొందుగా పూజింతు పదములు ॥౨॥

రు:—నరనాధ వర్ధిల్లు ధాత్రి । నీవు మరి క్షేమమా తెలుపు ధారా సుపుత్రి న॥ పరమ సంతసమాయె నీదగు స్థిరత శాంతగుణంబులకున్ నే-యురమునందున సంతసించితి ధరణిపై వర్ధిల్లు నృపవర ॥న-౪॥

చం:—తపసిదెల్పెద యొక్కమాటా । నేడు యిపుడుదెల్పెద నొక్క సరణి యిచ్చోటా ॥త॥ కృపచే నా పుత్రి వివాహంబిపుడు జేయగ బూనితిని యా చపలనేత్రికి షోడశాబ్దము లిపుడు వచ్చెను గాన గురుపర ॥౫॥

రు:—యి లోన భద్రాయువనగా । నొక్కబలుడు క్షత్రియవంశ కుల జుండు వేగా । యి । గలడు వానికి నుతనొసంగియు యిలలో కీర్తిన్ బొందుమి భూ-వలయమున కనుసానిపొరి కలుషహాతుడును బ్రోచు నేడూ ॥౬॥

చంద్రాంగదుడు వాక్యం.

క. ఆ రాజవదను డేపురి । ధీరత పాలించు నృపతి దివ్యసుతుండో
కోరికగల్గె వినంగను । కారుణ్యముతోడదెల్పు ఘనయోగీంద్రా.

ఋషభయోగి వాక్యం.

సీ. యిలనాయకా వినుము చెలగి యవంతికా । పురమునన్ భూసుర పుంగవుండు । మందరుండను వాడు మహిపేశ్యకుల జాత । పింగళ లోలుడై ప్రీతిబరగి । యుండంగ నేనందు నురు మోదమున నేగ । గావారు సద్భక్తి శాంతిమీర । పూజించి కొన్నాళ్ళ కీజగంబు త్యజించి । చనిరిరువురు పునర్జన్మ మొంది. గీ. రవనిలో వజ్రబాహు

క్షిత్యధిపునకును । వరసుతుండంత భద్రాద్రియు వనగబుట్టె । పింగళాం
బాఖ్య మున్న నీపేర్మిపుత్రి । కీర్తిమాలిని వినుమి సత్కీర్తిశాలి.

చంద్రాంగద రుమభయోగుల వాదం జంపెతాళం.

చ :—తాపసోత్తమా । యాభూపతి యేపురము నేలు । తా । కోపిం
పక దెల్పుమింక కూరిమి సతి సుతులెందరో । పాపుగ యా
వృత్తాంతము పరగన్ వినుపింపు మికా ॥తా-౧॥

రు:—సుందరరూపా । యానందమౌ దశార్ణపతీ । సుం । అందము
గను వజ్రబాహుడను యతనికి సతు లరువదియందు జ్యేష్ట
సుమతియందు గర్భంబునాయె ॥సు-౨॥

చం:—యెట్టి చిత్రముగ్ । నాతోటి దెల్పు యతికులేంద్ర । హాట
కేశ్వరుని కరుణ అతివగర్భమొందు పిదప । సూటిగనేమయ్యె
నో యాబోటికి వచియింపుమయ్య ॥యె-౩॥

రు:— సాటికాంతలున్ । యా బోటిపైని నోర్వలేక । సా । కుటిల
మతిచె గరళాన్నము కడువచేసి నంతలోన । తటకున వ్రాన
విం చె నొక్కతనయు నామయార్తుని విను ॥సా-౪॥

చం:—ధారుణీశుడున్ । యానారులు యొనర్పునకి । ధా । యేరీతగ
నొప్పి యంతా నేమిజేయ బూనెనపుడు । సారసాక్షి సుమతి
నెట్లు కూరిమిచే జోచెనో యిక ॥సా-౫॥

రు:—జనని సూనులున్ । వారఃయముగ బడుకష్టములను ॥జ॥ కను
గొని మది సైపలేక వనము కంపెనూ వారల । జనపతి కను
సానిపల్లి చండికేశు విధి యటనుచు ॥జ-౬॥

చంద్రాంగదుని వాక్యం.

కం. కాంతారములోపల కడు । వింతగు మృగబాధలేక విహా
రించిరిలన్ । యింతియు తానపుడెవ్వరి । చెంతను వసియించె వేగ
చెప్పు మహాత్మా.

రుమభయోగి కందార్థం.

కమలాప్తవంశ వినుమా । విమలాత్మడైన వైశ్య । వరుండో
కడున్ । భ్రమరాంబవరుని భక్తుడు । సుమతిని పాలింపుచుండా ॥ద॥

సుకుమారు డపుడూ నచటన్ । మరణించెను యిక యా-వికటామహా గరళా జ్వాలలకున్ । గకవిక లొందుచు కడు శోకింపగ । యిక నేనే గియు యీశ్వర కరుణతో । అకళంకామైనా భస్మమున్ । నిడినం తలో బాలుండిక బ్రతికె యూర్విలోపలన్.

వ నమ్మహీపతి సంతసించి మరి యేమనుచున్నాడు.

చంద్రాంగదుని వాక్యం.

కం. సమ్మతమాయెను మాకును । అమ్మహీపతి కొమరుడచటి కరుదెంచెడితో । యమ్మ వివరింపు మిఁ మో ।దమ్మాయెను మిగుల నాకు తాపసచంద్రా.

రుష భ యోగి మత్తకోకిల.

ద్వారపాలకునంపు డిక సత్వరిత గతిచె మీరలున్
కూరిమితో రప్పించుడిక సుకుమారుడౌ భద్రాయువున్
శ్రీరమేశుని సఖుని వేడియు శీఘ్రమే యొసరింపు సొం
పార పాణిగ్రహణ మతనికి భద్రమా కడు వేడుకన్.

చంద్రాంగదుఁకు మంత్రికి భద్రాయువుకు వాదం యేకం.

చం:—ద్వారాధిప వైశ్యపురము జేరి కడు వేడ్కన్ । సా సాక్షియా సత్య సుమతి నిటు జేరగ బిలువు కొమారుని యుక్తము.

మం:—ధరణీశా మీరు దెల్పిన సరణి తీరుగనూ । ధ । పరమభక్తుడౌ భద్రాయువు నిటు । త్వరగ దోడ్తెచ్చెద సరసగుణాఢ్య.

మం:—భూతాలాధీశ్వరానుత జేతు వందనముల్ । ఖ్యాతిగాను చం ద్రాంగద భూపతి ప్రీతిచె రమ్మనె మాత యుక్తముగ.

భ:—యె దూకూ బిలిచె భూపతిషుందు వివరించూ । అందముగను నినుయుందు దోలుటకు స దేహమెయ్యదో ందు దెల్పుత్వ.

మం:—గురువర్యుడూను క్షోణి నరవరుండునూ । కరమర్థితో నీపరి యమును సత్వరితము జేయుగ మరి యూహించిరి.

భ:—రతో నాని పొరి పురహారుని కరుణన్ । సరసుండగు సద్గుస వాక్యంబును । మరి మీరక నే సరగున వచ్చెద.

భద్రాయువు సుమతితో ననుటా.

కం. అమ్మరో చంద్రాంగదు డిటు । సమ్మతితో మనల బిల్వ సారథి నంపెన్ । యిమ్మగ గురువరు మదిలో । నమ్మిక బోదాము కదుమి నయగుణ శీలా.

సుమతికి భద్రాయువుకు వాదం యేకం.

సు:—నందనా వినూ । ఆనందమాయెరా । నం । అందు నేగుటకు ముందుగ నావది సందేహమివు డింపొంద గల్గెరా ॥నం-౧॥

భ:—అమ్మ నీలోనా । గల్గుసందేహము ।అ। సమ్మతితో శీఘ్రముమ్మన దెల్పుమి । అమ్మహేశు మదినమ్మి నీవు త్వర ॥అ-౨॥

సు:—నీదుతండ్రియూ । లేనిఃవాహము । నీ । మోదమాన యిక పాదుగ జేయుట కాదుకాదు సుమి మేదినిఃలోనన్.

భ:—ఖేదమొందకూ । మాతండ్రికొరకై । ఖే । హృదయములో గురుపదములు నమ్మియుకదవె తల్లి మనపట్టణమునకున్.

సు:—సంతసంబాయె । సరెరా నీవాక్యం । సం । మంతనమున కదు వింతనాయె నీశాంతగుణంబును సరగునజూచిన ॥నం-౩॥

భ:—క్షోణి కనుసాని । పౌరీశ్వరు నమ్మి । క్షో । పూని మన పురం బూను జేరగా మానుగ వస్తిమి మదిరంజిల్లగ ॥క్షో-౪॥

సుమతి వజ్రబాహుతో ననుటా.

కం. వందనము ప్రాణనాయక ♦ పొందుగ నీపాదములకు పూని యొనర్తున్ – నందనుని గనుమి యిక వో ♦ సుందరజిత మారరూప చూడ్కులు నిండన్.

వజ్రబాహువు వాక్యం.

గీ. కలికి నినుజూడ నామది కలఁకలాయెర పుడమి నావంటి కఠినుండు పుట్టనేల♦పలువిధంబుల నిను బాధఁరచినట్టి♦పాపకర్ముండ నేను వో పద్మగంధి.

మ గ్గురికి వాదు ఆదితాళం.

భ:—జనకా వందనమును జేసెద నీమనమున దయజూడూ ♦ యిక నేడూ ♦ వినయముతో మా జనని యుక్తముగ జనుదెంచితి

నిందూ ♦ యిక ముందూ.

వ:—తనయా మీకును ఘనశత్రుడనై వనమునకు బంపితిరా ♦ సుకుమారా ♦ పెను మృగములలో దినము గడిపి యిటు చనుదెంచితి వౌరా ♦ ఘనధీరా ‖త—౨‖

సు:—ప్రాణేశ్వర మనమూన నీవు కడు పూని గుందుటేలా ♦ యిక చాలా ♦ పూనికతో మా పూర్వఖర్మమె యిటు బోనిచ్చును వినుమా గుణధామా,

వ:—యింతిరో నీవు ... లెంతవనుచు మదికింత దెలియకాను । ఘనమూను ♦ పంతముతో ... స్వాతుడనై నేనింత యొ ర్చితినీ ♦ పనిబూనీ.

సు:—గడ'న ... నికిటు తశబడ నేలను ♦ ఘుడురాజఘరుండూ ♦ మము నిదూ ♦ కడు ... తోలుడు మూలగడిపియును పుడమీశ్వర బ్రోచెన్ ♦ ముదముగా ... న్.

భ:—ధరణి కనుసాన్ పురవాసు పుహిము ఆరయ నెవరితమా । నశమానా ♦ మరు ... సమ్మిన ... ను తానె దరిజేర్చును గాదె ♦ విన లేదె.

సుమతి వాక్యం. కంద.

విను ప్రాణేశ్వర నేనొక। మనవిని దెల్పెదను నీతో మాన్యచరిత్రా మహనుతునకు చంద్రాంగద। జననాథుడు లగ్నమిపుదు నల్పదలంచెన్.

వజ్రబాహు వాక్యం.

కం. సరసిజ నేత్రిరో నిషధా ♦ పురమున కిపుడరిగి మనము పూనిక తోడన్ ♦ త్వరలో భద్రాయుష్షునకు ♦ కరమతితో లగ్నమిపుడు గాజేయుదమా.

వ. ఇవ్విధంబునా సంతోషముతో వెడలి నిషధపురంబు జేరి చంద్రాంగదునకు వజ్రబాహుండు డిట్లనియె.

చంద్రాంగదునకు వజ్రబాహునకు వాదం. ఆట.

వ:—కుశలమా మీరంత నిషధా పౌరీశ్వరా కు । రసికగుణ ... ము

చిలువనంపిన విషయమెట్టిదో దెల్పుడి ॥కు-౧॥
అం:—మీదు సత్కరుణాచే మేమంత క్షేమంబె । మీ। మోదమొ
ప్పగ మీదు సుతునకు పాదుగా నాపుత్రి నొసగెద ॥మీ॥౨॥
వ:—గాంచుమి పీనిని పంచాస్త్రరూపుడు । గాం । యుంచుకైనను
మదిలో సంశయ ముంచకను నిక్కంబు ధీరా ॥గాం॥ ॥
చం:—ధరలో కనుసాన్ పౌరి పురహరు నమ్మియు । ధ । పరిణయం
బొనరింతమా కడు త్వరితముగ మనమిప్పుడూ ॥ధ॥४॥
రుషభయోగి వాక్యం.
కం. నరవర శుభసమయంబిది ♦ వరుడును బంధువులు మిత్ర
వర్గంబెల్లన్ ♦ అరుదెంచినారు కావున ♦ పరిణయ మొసరి చు డిక
శుభంబగు మీకున్.
వ. ఈ విధంబునా కీర్తిమాలిని భద్రాయువులకు వివాహం
బొనర్చిన తదనంతర బునా పరమేశ్వరుని గూర్చి యిట్లని ధ్యానించిరి.
ఆరుగురి వాదం చౌకతాళం.
వ:—శ్రీ గౌరీవర శ్రితజనపోషా ॥శ్రీ॥ నాగాభరణా నతజన పోషా
॥శ్రీ॥౧॥
చం:—ధవళాంగా మాధవనుత శంభో ॥ధ॥ ప్రవిమలముగ నిను ప్రస్తు
తి జేతున్ ॥దె॥౨॥
భ:—హరహర హరయని హాయిగ నెపుడూ ॥హ॥ యురమున నమ్మిన
నరులను బ్రోచూ ॥హ॥ ३॥
సు:—భూతపతేయని భూరిగ నెపుడూ ॥భూ॥ ఖ్యాతిగ వేడినగాచు
నిక్కంబూ ॥భూ॥४॥
కీర్తి:—వామదేవయని నామస్మరణా ॥వా॥ ప్రేమజేయ భవభీతి దొలం
గూ ॥వా॥५॥
రుష:—మనసిజ హరునిక అనయము గొల్తూ ॥మ॥ కనుసాని పురమున
నివసించూ ॥మ॥౬॥
వ. ఈవిధంబునా పరమేశ్వరుని ధ్యానించి వారివారి నిజనివా
సంబునకు జని తదనంతరము భద్రాయువును పట్టాభిషేకునిగా జేసి

సుఖాసీనులయి గుండిరంతా.

కం. సౌఖ్యదమా భద్రాద్రియు ♦ పాఖ్యానము వినిన భక్తి పఠి యించినచో ♦ ముఖ్యముగ శంభుకరుణన్ ♦ సౌఖ్యాయుర్వృద్ధి గలుగు జనములకెపుడున్.

మంగళహారతి కురుచజంజె.

హారతిదే మారహరా అహిపతి భూషా ♦ వారణ చంద్రాం బర ధర విమల ప్రకాశా ♦పారా ♦ వారా ♦ శౌరి ప్రియహితా ♦ గౌరి మనోహర గంగ జటాధర ॥హా॥౧ నీలకంఠ భవపిలుంఠ ఫాల లోచనా । బాల శశిధరాయు భక్తపాలితా ఘనా । కోలా । హాలా-కాలసంహారా । శూలాయుధా గిరిజలోలా మునిపాల ॥౨॥ రక్షణ ధవళగాత్ర దాసవాహరా । అక్షయ అమరాది వినుత అంబికేశ్వరా దీక్షా । వేషా । లక్షణ కైలాసపుర । దృక్షు సులక్షణ యీ క్షితిజయ ॥౩॥ క్షోణి శ్రీకనుసానిపల్లి స్థానియవాసా । నానామతిచే వేడు కృష్ణ నాము సుపోషా । దీనా । వానా । మానసంబునా । పూని యొసం గెద గొనుమిదె కర్పూర ॥హా-౪॥

గద్య.

ఇయ్యది శ్రీమన్మహాదేవ చరణారవింద సేవాపరాయణు డును
శైవబ్రహ్మ కులసంజాతుండును రామమ్మ అంతయ్యా
చతుర్థ సూనుండును కనుసానిపల్లి నివాసుం
డగు కృష్ణకవిచే శ్రీబ్రహ్మోత్తర ఖండా
న్తరగతంబగు భద్రాయుపోపా
ఖ్యానము యక్షగానం
రచింపబడియె.

పండితాఖండలు లిందలి దోషంబులుండిన క్షమింతురుగాక.

-♦ సంపూర్ణము ♦—

ఈ గ్రంథమునకు చాపవేయించుటకు
సాయము చేసినవారి నామములు—

శేరికర్ణసానిపల్లి మ. రా. శ్రీ.
శేరి లక్ష్మారెడ్డి మొ॥ మా॥
శేరి నర్సరెడ్డి మొ॥ కొ॥
నారాయణరెడ్డి మొ॥ మా॥
వెంకటరెడ్డి మొ॥ కొ॥
రాంరెడ్డి ,,
హన్మంతురెడ్డి ,,
నాగోరావు మొ. కు॥
ఆ॥ నారాయణరెడ్డి—
ఆ॥ రాయిరెడ్డి
కాయిత మల్లరెడ్డి.
మన్నె నారాయణ.
,, కిష్టయ్య.
నార్పమల్లప్ప శెట్టి.
తాళ్ళ నారాయణ.
,, రామయ్య.

మొకుల అంతయ్య ప॥
ోట వెంకయ్య ,,
ొల్ల రాములు ,,
మల్లయ్య
కూంభూమయ్య.
పోల రాజయ్య.
నవు వెంకయ్య.
మాదేకుల కమాల్

ముసలాపురం.

వెంకటరావ్ మొ॥ కు॥
ంగారెడ్డి దేశ॥
గారెడ్డి మొ। కొ॥
ష్ణయ్యగారి సంగన్నగారి వెంకయ్య
ష్ణయ్యగారి రామయ్య

నేరడగుంట

ద్దప్ప మొ॥ మా॥
మొయిగిగుడ్ల సంగయ్య.
రణప్పగారి సంగప్ప.

దిివ్యసా ||

,, లక్ష్మయ్య.
బచ్చు వీరన్న.
,, నారాయణ.
మడుపతి వీరయ్య.
జూకంటి తాజన్నగారి సంగయ్య.
గజవాడ రామయ్య.
పురం కిష్టయ్య.
పోట్టిపల్లి మల్లయ్య.
శిద్దం శెట్టి సంగయ్య.
రాపతి బల్ రాం. ౯౭
ముష్టి మల్లయ్య.
లింగగాడు.
భూమగాడు.
విశ్వబ్రహ్మ అంతయ్య.
సుల్తంటె శంకరప్ప.
చల్లమల్లయ్య.
మను బ్రహ్మ సంగయ్య.
బొడ్డు వెంకయ్య.

మక్తా రాం రెడ్డి.
,, క్రిష్ణ రెడ్డి.
,, లక్ష్మ రెడ్డి.
,, సంగ రెడ్డి.
,, చినక్రిష్ణ రెడ్డి.
మల్లికార్జున బసప్ప
గొల్ల మల్లయ్య.
గున్నాల సంగప్ప.
మదారుసాబు.

మొరివరం. ౯౮.

గంగరెడ్డి మొ॥ మా॥
చెన్నరెడ్డి మొ॥ కొ॥
వెంకన్న పట్వారి.
విశ్వబ్రహ్మ బాలక్రిష్ణయ్య.
లింగాయతి శాంతప్ప.
కుసంగి పత్తిగారి నారాయణ బాగన్న.
మనుసానిపల్లి లక్ష్మ రెడ్డి. మొ॥ మా॥
,, నాగరెడ్డి మొ॥ మా॥

రాంసానిపల్లి.

కజారి కిష్ట రెడ్డి.
విశ్వబ్రహ్మ బ్రిహ్మయ్య.

గడిపెద్దపురం.

ఊమ్మయ్యగారి రామలింగం.
వాసర అన్నయ్య.
చొక్కారం నరసింహ్ములు.
చొక్కారం యీరయ్య.
బచ్చుమల్లయ్య
గాజుల అనంతరాం.
విశ్వబ్రిహ్మ మాణయ్య.
కాలం క్రిష్ణమ్మ.
సారక్రిష్ణాజి.

బిజలిపురం.

మల్లయ్య మొ॥ కొ॥
అన్నంతు మొ॥ మా॥
విశ్వబ్రిహ్మ నరసింహ్ములు.
దక్షి విశ్వనథం.

బెజ్జం శెంకరయ్య.
మయబ్రహ్మ యీరకప్ప.
పలువట్ల నాగులపల్లి.
హన్మంతురెడ్డి మొ॥ మా॥
పంగకాల్ రెడ్డి.
ప॥ సంగరెడ్డి.
మడుపతి వరుసయ్య.
కల్ల అంజిరెడ్డి.
గొల్ల మల్లగోడు
బాగ్గాడు.
కలాల్ సత్యయ్య.

రాయికోడు.

చెన్నయ్య ముస్తాదర్.
నరుసయ్య ,,

కేహూరా.

అడివన్న మొ॥ మా॥
అంజన్న మొ॥ కొ॥
గాండ్లహన్మన్న తాళవెల్మె.

అకాన్నిపల్లి.

రాం క్రిష్ణరెడ్డిగారి నారాయణ రెడ్డి మొ॥
మల్లన్న మొ॥ మా॥
అక్క శివప్ప.

యాడ్మన్నూరు.

శివరెడ్డి మొ॥ మా॥
అంతిరెడ్డి మొ॥ కొ॥

పెద్దరెడ్డిపేట.

పెద్ద చొక్కయ్య.
కొడిప్యాక లింగయ్య పొ॥

# మావద్ద దొరకు పుస్తకములు.

| | |
|---|---|
| ధిజాతకబోధిని | వెల 3-0-00 |
| అనుభవమంత్ర రాజీయము | వెల 1-8-0 |
| రాశిగణిత చూడామణి | వెల 0-6-0 |
| జయంత జయపాల | వెల 0-12-0 |
| సంగీత సత్యహరిశ్చంద్ర | 0-12-0 |
| లంకాదహనం | 0-12-0 |

జీవబ్రహ్మైక్య వేదాంత రహస్యము

వెల 3-11-6

బాలనాగమ్మచరిత్ర యక్షగానము

వెల 0-6-0

| | |
|---|---|
| రసాయన రాజీకరణ తంత్రములు. | వెల 3-11-6 |
| సర్వౌషధిగుణకల్పకము | వెల 3-13-0 |